# తత్త్వశాస్త్రం అంటే ఏమిటి?

డాక్టర్ కె. విల్సన్

# ముందుమాట

తత్త్వశాస్త్రాన్ని గురించి ఇటు విద్యార్థిలోకం అటు సామాన్య ప్రపంచం చిత్రవిచిత్రమైన భావాలు వ్యక్తం చేస్తున్నాయి. బహుశా, దీనికి కారణం, తత్త్వశాస్త్రమంటే ఏమిటో తెలియకపోవడమైనా అయివుండాలి లేదా తత్త్వశాస్త్రాన్ని గురించిన అవగాహన సరియైనది కాకపోవడమైనా అయివుండాలి. విశ్వవిద్యాలయాల్లో తత్త్వశాస్త్రాన్ని చదివే విద్యార్థులు సహితం, "తత్త్వశాస్త్రాన్ని ఎందుకు చదవాలి?" "చదివితే ఏమి వస్తుంది?" అనే ప్రశ్నలవర్షం కురిపించడం షరా మామూలైంది. ఈలాంటి ప్రశ్నలను కొన్నిసంవత్సరాలుగా వినివిని, ఈ ప్రశ్నల వెనక యథార్థమైన కారణాలున్నాయని గుర్తించి, వీటికి జవాబుగా ఈ చిన్న పుస్తకాన్ని వ్రాయదలచాను.

ఇక్కడ తత్త్వశాస్త్రాన్నిగాని, తత్త్వశాస్త్రచరిత్రనుగాని రాయలేదు; రాయతలపెట్టలేదుగూడ. అసలు తత్త్వశాస్త్రమంటె ఏమిటి? తత్త్వశాస్త్రాన్ని ఎందుకు చదవాలి? చదివితే తెలుసుకోగలిగిన విషయాలేవి? అనే ప్రశ్నలకు సమాధానమివ్వడానికి మాత్రమే ప్రయత్నించాను. అనగా తత్త్వశాస్త్రాన్ని అధ్యయనం చేయడానికై ప్రేరణగా వుండడానికి ఈ పుస్తకపు లక్ష్యం పరిమితం చేయబడింది.

ఇది కేవలం తత్త్వశాస్త్రాన్ని చదివేవిద్యార్థులను ఉద్దేశించి రాయలేదు. తెలుగు భాష చదవగలిగిన ఏ వ్యక్తియైనా, సులువుగా చదవడానికి, అర్థంచేసుకోడానికి, తాత్త్వికచింతనను పెంపొందించుకోడానికి మాత్రమే ఉద్దేశించబడింది.

ఈ పుస్తకాన్ని చదివిన వారిలో తత్త్వశాస్త్రాన్ని చదవాలనే కుతూహలం, అభిరుచి ఏ కొద్దిమోతాదులోనైనా జనిస్తే దీనిని రాసిన ఉద్దేశం కొంతవరకు నెరవేరినట్లే.

ఆగష్టు 15, 1986
జాషువా నిలయం, హైదరాబాదు.

కె. విల్సన్

# విషయ దర్శిని

# 1

# తత్త్వశాస్త్రం: అర్థాలు, అపార్థాలు

ఓహో "మనవాడు..........తత్త్వశాస్త్రం చదువుతున్నాడటండీ," అనే వ్యంగ్య వ్యాఖ్యానాలు ఈ రోజుల్లో విశ్వవిద్యాలయాల్లో తరచుగా వింటున్నాం. తత్త్వశాస్త్రంపట్ల సగటు ఆధునిక మనిషి భావాలు, మరి విశేషంగా యువతరపు ధోరణి ఈ విధమైన మాటల్లో వ్యక్తమౌతున్నాయి. తత్త్వశాస్త్రం చదివి లోకాన్ని తలక్రిందులు చేయడానికి వెళ్ళినట్లున్నా, ఐతే వాస్తవంగా అలాంటిది జరిగేదిమాత్రం శూన్యమైనట్లు సూచిస్తున్నాయా మాటలు. అంతేగాక, తత్త్వశాస్త్రమేదో ఆకాశంలోవుండే అత్యున్నతమైన అంశమైనట్లున్నా, దానిని అధ్యయనం చేయడం సామాన్య మానవులకు అసాధ్యమనే భావంగూడ ఈ ధోరణిలో ప్రస్ఫుటమౌతుంది. తత్త్వశాస్త్రం కేవలం వృద్ధాప్యంలో ఆనందించే విషయంగాను, మళ్ళీ మాట్లాడితే, అది కేవలం సన్యాసులకు సంబంధించిన అంశంగా పరిగణించడం గూడ పరిపాటి అయ్యింది. పైగా, తత్త్వశాస్త్రాన్ని చదివితే సన్యాసులౌతారని నాస్తికులౌతారని, భావించడం జరుగుతూవుంది. దీనికితోడు తత్త్వశాస్త్రం చదివితే ఉద్యోగాలేమీ దొరకవని, సమాజంలో ఏ ఇతరమైన ఉద్యోగమూ చేయడానికి ఈ అంశం పనికిరానిదని విద్యార్థిలోకపు అంచనా. అంతేగాక ఏ ఉద్యోగమూ దొరకని వారికి కాలక్షేపం చేయడానికి ఉపకరించె అంశంగా ఎంచుతున్నారుకూడ. ఏనాడో ఎవరో ఆనాటి పరిస్థితులకు రూపొందించుకొన్న తాత్త్విక పరిష్కారాలను ఈనాటి సమాజమెదుర్కొనే సమస్యలకు అమల్లో పెట్టడం జరుగుతుందని, ఇందువలన తత్త్వశాస్త్రం దైనందిన జీవిత పరిస్థితులకు అనువైనదికాదని కొందరి ఆవేదన. దీనితో

బాటు, తత్త్వశాస్త్రజ్ఞులు చాల విజ్ఞతగలవారని, ఎన్నెన్నో విషయాలు తెలిసినవారని, ఆదర్శ పురుషులని, మాన్యతకు సంస్కృతికి ప్రతీకగా వుంటారని గూడ ఊహించబడుతూంది. ఐతే, ఎదురుచూచిన ఈ లక్షణాలు చాల మంది తత్త్వశాస్త్రజ్ఞుల్లో కనిపించనందున, ప్రజల్లో తత్త్వశాస్త్రంపట్ల ఒక విధమైన ఏహ్యాభావం జనించియుండవచ్చు. ఈలాంటి భావాలు చెలామణిలో వున్నందువల్లనే కాబోలు తత్త్వశాస్త్ర అధ్యయనానికి యువ తరం దూరమైపోతుంది. మొత్తానికి తత్త్వశాస్త్రం నిరుపయోగమైనదని, జీవితసమస్యల పరిష్కారానికి తోడ్పడేదికాదనేభావం జనంలో బలపడింది. ఈ రకంగా వ్యక్తపర్చబడుతూన్న భావాలను పూర్తిగా సమర్థించలేము. పూర్తిగా కాదనలేముగూడ. ఈలాంటి భవాల్లో కొంత సత్యం. అపార్థం, కొంత అజ్ఞానం, కొన్ని భ్రమలుగూడ చోటుచేసికొని వున్నయి.

నిజానికి తత్త్వశాస్త్రాన్ని రాసేవారందరూ లేక చదివేవారందరూ, ఉత్తమ పురుషులు కాకపోవచ్చు. తత్త్వశాస్త్రజ్ఞులు వేరు, తత్త్వశాస్త్రాన్ని బోధించే వ్యక్తులు వేరు. సాధారణంగా తత్త్వశాస్త్రాన్ని బోధించడం ఒకవృత్తిగామారింది. కేవలం వృత్తిగా, లేకజీవనోపాధికై తత్త్వశాస్త్రాన్ని బోధించే వారిని, నిస్వార్థంగా ఒక ఆశయంతో, దర్శనంతో, ధ్యేయంతో తత్త్వశాస్త్రాన్ని రూపొందించేవారిని ఒకే గాడిన కట్టివేయకూడదు. కొన్ని సార్లు జీవనోపాధికై తత్త్వశాస్త్రాన్ని బోధించే వారిలో తాత్త్విక జిజ్ఞాస ఏ మాత్రం లేకపోవచ్చు. అంతేగాక కేవలం తాత్త్విక జిజ్ఞాసకు విరుద్ధమైన, అహేతుక, అశాస్త్రీయ, అతాత్త్విక భావాలు వీరిలో తాండవమాడవచ్చుగూడ. కాబట్టి వృత్తిపరమైన తత్త్వశాస్త్రజ్ఞులను చూచి తత్త్వశాస్త్రాన్ని అంచనా వేయడం న్యాయంకాదు; సబబుకాదు. వాస్తవంగా మన సమాజం తత్త్వశాస్త్రానికి, తాత్త్విక జిజ్ఞాసకు పేరుగాంచింది. ఐనప్పటికీ ఆ తత్త్వశాస్త్రమే ఇతర అంశాలకంటె ఎక్కువగా అపార్థం చేసుకోబడుతున్న ట్లుంది. దీని నంతటినిబట్టిచూస్తే తత్త్వశాస్త్రం ఒకవైపు ఔన్నత్యమైన జిజ్ఞాసగాను మరొకవైపు నిరుపయోగమైన విద్యగాను పరిగణించబడుతుంది. అసలు తత్త్వశాస్త్రమంటె ఏమిటి? దేవుళ్ళను గురించి, ఆత్మలను గురించి,

మంత్రతంత్రాలను గురించి, నీతులను గురించి, బోధించదమా? వాస్తవానికి మన సమాజంలోని సగటు మనిషి దృష్టిలో దైవాలు మతాలు, ఆత్మలు మొదలగు వాటిని గురించిన జిజ్ఞాసను కలిగి యుండడమే తత్త్వశాస్త్ర మన్నట్లు భావించబడుతుంది. ఈ విషయంలో చదువుకున్న వారికి (విద్యావంతులనబడే వారికి) చదువులేని వారికి ఏ మాత్రం భేదం లేదు. ఈ రోజుల్లో అతాత్త్విక అశాస్త్రీయ ధోరణులు, చదువులేని వారి కంటె చదువుకున్న వారిలో అత్యధికంగా వ్యక్తమౌతున్నాయి. ఈ పరిస్థితి సామాన్య ప్రజల్లో చాల అల్లకల్లోలాలను, అరాచకత్వాలను సృష్టిస్తుంది. ఎందుకంటే చదువుకున్నవాడంటె తెలివిగలిగినవాడని అంతేగాక, జ్ఞానం కలిగినవాడనే భావం సమాజంలో బలపడింది. ఈ భావాన్ని ఆసరాగా చేసుకొని, చదువుకున్నవారు, వారికి తెలిసి తెలియని తత్త్వశాస్త్రాల పేరున, ప్రజలను తప్పు త్రోవను పట్టించడం కళ్ళారా చూస్తున్నాం. వేర్పాటు వాదాలు, కుల దురహంకార పోకడలు, వర్గప్రయోజనాలు, దేశ వికేంద్రీకరణా ధోరణులు మొదలైన వాటికి పునాదులు వేసేది ఈ తాత్త్విక జిజ్ఞాసలేని మన విద్యావంతులే.

నిజానికి తత్త్వశాస్త్రమంటే మతంగాదు; కనిపించని విషయాలను గురించిన అధ్యయనంగాదు. కేవలం దేవుణ్ణి గురించి చర్చించటంగూడ కాదు. మర్మంతోగూడిన విషయం అంతకంటేకాదు ఆ మాటకువస్తే తత్త్వశాస్త్రం జీవితానికి వేరుగా భూమికి దూరంగా వుండేది కానే కాదు. మనిషిని గురించి, మనిషి చూచే ఈ ప్రపంచాన్నంతటిని గురించి, మనిషి ఏమేమి వుందనుకుంటాడో వాటి నన్నింటిని గురించిన జ్ఞానార్జనకైన తపన, అన్వేషణలే తత్త్వశాస్త్రం. మరో రకంగా చెప్పాలంటే, వున్న వాస్తవాన్ని, వుందని నమ్మబడే వాస్తవాన్ని అర్థంచేసుకోడానికి, వాటి సత్యాన్ని తెలుసుకోడానికి, విశ్లేషించడానికి మానవుడు చేసే వివేచనాత్మక (reflective) ప్రయత్నమే తత్త్వశాస్త్రం. కనిపించేవి, కనిపించక పోయినా వున్నవని నమ్మబడేవి ఈ పరిధిలోకి వస్తాయన్నమాట. దీనినిబట్టి జీవితానికి, వాస్తవానికి, తత్త్వశాస్త్రమున్నంత దగ్గరలో మరేది లేదనే చెప్పాలి.

తత్త్వశాస్త్రానికి జీవితానికి మధ్య ఇంత సమీప సంబంధమంటే, తత్త్వశాస్త్రాన్ని ఏదో మనకతీతమైనదిగా, మనకు అందనిదిగా ఎందుకు ప్రజలు అభిప్రాయ పడుతుంటారు? దీనికి నాలుగు ముఖ్యకారణాలున్నాయి. ఒకటి అర్థంచేసికోలేని భాషను వాడే తత్త్వశాస్త్రజ్ఞులు, రెండవది జీవితానికి అన్వయంతంకాని, సుసంగతంగాని, (irrelevant) తత్త్వశాస్త్రాలు, మూడవది ఆలోచించలేని ప్రజలు, నాల్గవది ఆలోచించడానికి వీలులేని పరిస్థితులు. తత్త్వశాస్త్రజ్ఞులు కొన్నిసార్లు ప్రపంచం, జీవితం, వాస్తవం, దేవుడు అనే కొన్ని అంశాలపై ఎవ్వరికీ అర్థంకాని స్థాయిలో పెద్ద పెద్ద పదాలు వాడినా మాట్లాడినా లేక రాసినా అలాంటి వారిని చాల ఉన్నతమైన తత్త్వశాస్త్రజ్ఞులుగా ఎంచడం గూడ జరుగుతుంది. ఒక చిన్న విషయాన్ని వివరించడానికి గూడ పెద్ద పెద్ద మాటలు, కొత్త కొత్త మాటలు వాడతారు. మనకు తెలియని సందర్భాలనుండి పరిసరాల నుండి ఉదాహరణలను చూపిస్తారు. అనగా సామాన్య మానవుడు ఎరగని, ఎన్నడూ చూడని వస్తువులను (అంశాలను) ఉదాహరణలుగా వాడుతారు. ఇందువలన అసలు ఏ విషయాన్ని గురించి చెప్పదలచారో ఆ విషయం ఆ పదాలలో మునిగి పోతుంది; అర్థంగాని పదాలు పుస్తకాల్లో తేలుతుంటాయి. ఈ అర్థం గాని పదాలతో కుస్తీపట్టలేక అసలు తత్త్వశాస్త్రమే అర్థంగాని అంశమని అపార్థం చేసుకొని ప్రజలు తత్త్వశాస్త్ర అధ్యయనం నుండి పారిపోతుంటారు. వాస్తవంగా అర్థంకానిది తత్త్వశాస్త్రం కాదు. తత్త్వశాస్త్రాన్ని రాసే తత్త్వశాస్త్రజ్ఞులు వారి మాటలున్నూ. రెండవది, తత్త్వశాస్త్రజ్ఞులు ప్రపంచాన్ని (సమాజాన్ని) వివరించి విశ్లేషించి మార్గదర్శక సూత్రాలను రూపొందించేటప్పుడు వారు సమకాలీన ప్రపంచాన్ని, సమస్యలను పరిస్థితులను అశ్రద్ధ చేస్తుంటారు. అంతేగాక, ఆలోచనా ప్రపంచాన్ని వాస్తవ, పదార్థ ప్రపంచానికి వేరుగా ప్రత్యేకంగా వుండేదిగా భావిస్తారు. ఇక్కడ ఆలోచనకు వాస్తవాలతో సంబంధం వుంటుందనే విషయం నిరాకరించబడింది. పైగా, ఈనాటి ప్రపంచాన్ని ఏనాడో రూపొందించబడిన భావాల దృష్ట్యా వివరిస్తుంటారు. ఇట్లు చేయడం వలన, ఈ తరానికి తాత్త్వికజ్ఞానం లేదన్నట్లు లేక తక్కువగా వున్నట్లు అంచనా వేస్తుంటారు. ఇట్లు చేయడంవలన, ఈనాటి

సమస్యలను పక్కదారిన పట్టించినట్లౌతుంది. వీరు రూపొందించె తత్త్వ శాస్త్రానికి సమకాలీన వాస్తవానికి పొంతన లేకపోవడం జరుగుతుంది. ఇట్లు తత్త్వశాస్త్రపు సుసంగతత్వం ప్రశ్నించబడుతుంది. మూడవదిగా వాస్తవాన్ని అనగా ప్రకృతి, మనిషి, మనసు మట్టి అనే మొదలగు విషయాలను అర్థంచేసికొని వాటి సత్యాన్ని తెలుసుకోవాలంటే, ఒక వ్యక్తికి కనీసజ్ఞానం (అనగా ప్రపంచాన్ని గురించిన జ్ఞానం) కొంత మేరకైనా వుండి తీరాలి. దీనికి విద్య కొంతవరకు అవసరమైయుంటుంది. కనీసం ఇంగిత జ్ఞానమైనా కలిగివుండాలి. సార్వత్రిక, భావాత్మక ధోరణిలో అధ్యయనం చేసి, ఆలోచించి, ప్రతిబింబించగలిగే శక్తి కొంత మోతాదులోనైనా వుండాలి. ఈ మాత్రం జ్ఞానంగూడ లేకపోతే, తత్త్వశాస్త్రాన్ని గ్రహించడం సాధ్యంకాదు. అందువల్లనే వివేచనాత్మక అన్వేషణల్లో నిమగ్నులైన వారిని జ్ఞానులని లేక తత్త్వశాస్త్రజ్ఞులని అంటారు. దీనిని బట్టి ఆలోచిస్తే అక్షరాస్యత అతి తక్కువ స్థాయిలో వున్నా మన సమాజంలో తత్త్వశాస్త్రాన్ని రాయాలన్నా, రాసిన తత్త్వశాస్త్రాలను చదివి వాటిని గురించి చార్చించాలన్నా ఒక సమస్యగా వుందంటే అందులో ఆశ్చర్యమేముంది? ఈ విధమైన సందర్భాల్లో రెండు విచిత్రమైన పరిణామాలు తలెత్తుతాయి. ఒకవైపు సామాన్య మానవులకు అర్థమైనా కాక పోయినా, ఏవో ఆత్మలు పరమాత్మలు లాంటి విషయాలను గురించి రాసి దానినే తత్వశాస్త్రమనుకొంటూ, వారికి మాత్రమే తాత్త్విక జ్ఞానం పరిమితమై యుంటుందని భావించుకునే గుత్తాధిపత్య శాస్త్రజ్ఞులు కొందరు వెలుగులోనికి వస్తుంటారు. సాంప్రదాయంగా జరిగినదిదే. వీరి దృష్టిలో వారే తత్త్వశాస్త్రజ్ఞులు. పైగా, ఆత్మలు, పరమాత్మలకు గురించి వారిచ్చే వివరణలు శాస్త్రీయ పరిశోధనకు అతీతంగా వుంటాయి. కాబట్టి వాటిని గురించి ఏమిచెప్పినా సబబేనని, వాటి జ్ఞానం సామాన్యులకు గోచరం కాదనె నినాదం బలపడుతుంది. దీని పర్యవసానంగా ప్రజలు వాటిని గురించిన వివరణను నమ్ముతారుగాని వాటి సత్యాసత్యాలను పరిశీలించడానికి ప్రయత్నించరు. ఇట్లు ఒకవైపు తత్త్వశాస్త్రజ్ఞుల్లోనూ, మరొకవైపు ప్రజలలోనూ, తాత్త్విక పదును తగ్గిపోతుంది. ఈ

సందర్భాల్లో మత పరమైన నమ్మకాలు అధికమౌతాయి; చివరకి మతమే తత్త్వశాస్త్రమన్నట్లు భావించబడుతుంది.

సామాన్య మానవుడు తత్త్వశాస్త్రాన్ని భావాత్మక స్థాయిలో అర్థం చేసుకోవాలని ఆశించడం (ఎదురుచూడడం)లో విజ్ఞత కనపోవచ్చు. సామాన్య మానవుడు తత్త్వశాస్త్రాలవల్ల జరిగే మార్పులు, ఫలితాలను మాత్రమే ఎదుర్కొంటాడు. కొన్నిసార్లు ఒక తత్త్వశాస్త్రి తత్త్వశాస్త్రాన్ని రూపొందించిన తరువాత, అది సామాన్య ప్రజానీకపు స్థాయికి చేరడానికి, బహుశా ఎన్నో దశాబ్దాలు పట్టవచ్చు. రూపొందించిన తాత్త్విక భావాలు సమాజానికి కోరదగినవి, అత్యవసరమైనవని గుర్తించడం మొదటి మెట్టు. ఈ సత్యాలు సామాన్య ప్రజల వరకు చేర్చాలనే లక్ష్యంతో, వాటిని శాసనాలు లేక పథకాల రూపాల్లో అమల్లో పెట్టె రాజకీయ సంకల్పం రెండవ మెట్టు. వీటి పర్యవసానమే సమాజంలో జరిగే మార్పులు, కూర్పులు. కాబట్టి ఆలోచనా స్థాయిలో సామాన్య మానవుడు తత్త్వశాస్త్రజ్ఞులతో సమతూగాలనడం అసంబద్ధం. ఐతే ఆలోచనకు, క్రియకు మధ్య సమన్వయాన్ని సాధించి, ఆ సమన్వయాత్మక (integral) తత్త్వశాస్త్రాన్ని రాస్తే దానిని సామాన్య మానవుడు గూడ గ్రహించగలడు; దానికి జవాబివ్వగలడుగూడ. అనగా వాస్తవానికి జవాబుగా రూపొందె తత్త్వశాస్త్రాలను ఎవరైనా అర్థం చేసుకోగలరు. కాని అలాంటి తత్త్వశాస్త్రాలను రాసే తత్త్వశాస్త్రజ్ఞులు ఈనాటి భారతదేశంలో పట్టపగలు దీపంబట్టి వెతికినా దొరకడం కష్టంగా వుంది. నాల్గవదిగా సామాజిక స్థాయిలో ఆలోచించాలంటే ఆలోచించడానికి కావలసిన తీరిక ఉండాలికదా? పొట్టకొరకు దైనందిన కనీస జీవితావసరాలకొరకు ప్రాకులాడే వారికి సమాజాన్ని గురించి, ప్రపంచాన్ని గురించి ఆలోచించమంటే అది జరిగే పనేనా? ఈ కనీస అవసరాలు తీరినప్పుడే సామాజిక సార్వత్రిక ధోరణిలో ఆలోచించే అవకాశం అందరికి వుంటుంది. కాబట్టి ఆలోచించడానికి అనువైన పరిస్థితులుంటె, పండితుడు పామరుడనే వ్యత్యాసం లేకుండా, అందరూ సామాజికంగా ఆలోచించగల స్థాయికి చేరగలరు.

భారతీయ సాంస్కృతిక వాస్తవాలదృష్ట్యా ఆలోచిస్తే (అంచనావేస్తే) ఒక మతానికిగాని, ఒక కులానికిగాని, ఒక ప్రాంతానికిగాని, ఒక భాషకుగాని నిబద్ధుడై (committed) యుంటూ యదార్థమైన తత్వశాస్త్రి కానేరడు. మరొక విధంగా చెప్పాలంటె, మతోన్మాదం, కులతత్వం, ప్రాంతీయతత్వం, భాష విచక్షణ గలవాడు ఒక వర్గాభిమానిగానే చెలామణి అవుతాడు. అతడు ముమ్మాటికి తత్వశాస్త్రి కానేరడు; కాడు. అసలు సిసలైన తత్వశాస్త్రి సార్వత్రికతకు, మానవతకు, విశాలతకు, వివేచనాత్మకతకు, శాస్త్రీయతకు ప్రతీకగా వుంటాడు; ఈ ధోరణిలోనే తత్వశాస్త్రాన్ని రూపొందిస్తాడు. అలాంటి వారిలో మాటకి చేతకి మధ్య అవిభాజ్య పొందిక అనివార్యంగా వుంటుంది.

2

# తత్త్వశాస్త్రపు ప్రత్యేకత

ఎ. తత్త్వశాస్త్రం వాస్తవికతను వివేచనాత్మకంగా శాస్త్రీయంగా అధ్యయనం చేస్తుంది. ఆ విశ్లేషణను మానవ జీవితానికి మేళవించ యత్నిస్తుంది. ఇక్కడ వాస్తవికత అంటె ప్రకృతే (పదార్థమే) కాదు, మానవజాతి గూడ; అనగా మట్టి, మనిషి రెండూ కలిసి పదార్థంగా వ్యవహరించబడ్డాయి. వాస్తవమంటె మానవుని సంవేదనలకు (sensations) ప్రత్యక్షతకు (perception) వివేచన, (reason) కు గోచరమైన, తెలుసుకోబడదగినదని అర్థం. కాబట్టి ఒకవైపు మానవ వాస్తవికత, మరొక వైపు ప్రకృతి ఈ రెండూ తత్వశాస్త్ర అధ్యయన పరిధిలోనికి వస్తాయి. ఇంతేకాదు; మనకు కనిపించని, మన స్పర్శకు, ఆలోచనకు అతీతమైన వాస్తవాలు గూడ వున్నాయని కొందరు భావిస్తున్నారు. ఆ వాస్తవాలను దేవుడనండి, దయ్యమనండి, స్వర్గమనండి, నరకమనండి. పేర్లు ఎన్నో వుండవచ్చు కాని, మనకగోచరమైన మరో ప్రపంచం, మరో వాస్తవం వున్నదనే వాజ్మూలాలను, ప్రతిజ్ఞావాక్యాలను తార్కికంగా పరిశీలించడం గూడ తత్త్వశాస్త్రపు పని. మొత్తానికి, కనిపించే వాస్తవం, వాస్తవమైనదిగా ఎంచబడిన కనిపించని ప్రపంచం, తత్త్వశాస్త్ర అన్వేషణా పరిధిలోకి వస్తాయి. దీనినిబట్టి తత్త్వశాస్త్ర అన్వేషణాపరిధిలోనికి రానిది ఏదీ లేదన్న మాట. ఇందువల్లనే, తత్త్వశాస్త్రం సామన్య దృక్పథంలో పయనిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే మానవుడే తత్త్వశాస్త్రానికి మూలము. విస్తృతార్థంలో మానవ జీవితం, మానవునికి, మానవునికి వేరుగా వుండె వాస్తవానికి మధ్య జరిగే కార్యాచరణలే తత్త్వశాస్త్రానికి మూలం. వాస్తవమంతటిని

సామస్త్య దృక్పథంతో అర్థం చేసుకోవాలనే ప్రయత్నమే తత్త్వశాస్త్రానికి మూలం. ఈ ప్రయత్నమంతా ఆలోచనమీద పయనిస్తుంది. ఆలోచించడమనేది మనుషులందరికి సహజమే గదా? కేవలం తత్త్వశాస్త్రజ్ఞులే ఆలోచించేవారని ఎందుకనాలి? అసలు తత్త్వశాస్త్రమంటే ఒట్టిగా ఆలోచించడమేనా? భౌతిక (ప్రపంచ) వాస్తవంలో ఈ ఆలోచనకేమీ సంబంధముండదా? ఆలోచన మీద భౌతిక వాస్తవానికేమీ ప్రభావముండదా? స్థూల వాస్తవానికి సంబంధంలేకుండా ఆలోచించడమే తత్త్వశాస్త్ర ప్రత్యేకతయైతే, తత్త్వశాస్త్రాన్ని అధ్యయనం చేయడం శుద్ధ దండుగౌతుంది. నిజానికి అందరూ ఆలోచిస్తారు, ఆలోచించవచ్చు. కాని ఆలోచించే ఆలోచన యొక్క స్వభావమేమి? ఆ ఆలోచనయొక్క నిర్మాణమేమి? లక్ష్యమేమి? అనే ప్రశ్నలకు వచ్చే జవాబులలో తత్త్వశాస్త్రపు ప్రత్యేకత బయల్పడుతుంది; అంతేగాక వాస్తవానికి తత్త్వశాస్త్రం ఎంత సమీపంలో ఉంటుందో గూడ బయల్పడుతుంది.

బి. తాత్త్విక జిజ్ఞాస ఒకరు బలవంతపెడితే వచ్చేదికాదు. ఒక వృత్తి కూడా కాదు. అది ఒక బాధ; ఒక కళ; ఒక స్వయం ప్రోద్బలం. దీనిలోని ప్రత్యేకతలలో మొదటిది వివేచనాత్మకత. ఒక విషయాన్ని లేక వస్తువును అర్థం చేసుకోవడానికి మనిషి ఎన్నెన్నో సాధనాలను వాడతాడు. ఒకడు కేవలం సంవేదనలనే (sensations) జ్ఞాన సాధనాలుగా వాడతాడు. అధిక సంఖ్యాకులైన ప్రజలు ఈ స్థాయిలోనే ఉండిపోతారు. మరికొందరు తమఆత్మాశ్రయ(స్వంత)భావాలను, స్పందనలను (feelings) ప్రమాణాలుగా తీసికొని అర్థం చేసుకో ప్రయత్నిస్తారు. ఈ సందర్భాలలో వ్యక్తి ఆర్జించే జ్ఞానాన్ని నిష్పక్షపాతమైనదని చెప్పలేము. ఎందుకంటే ఈలాంటి జ్ఞానాన్ని బాహ్యాత్మకంగా దృఢపర్చలేము. మరియు వ్యక్తి తాను దేనినైతే సత్యమని నమ్ముతాడో, ఊహిస్తాడో, వాటినే సార్వత్రిక మైనవని గోల పెడతాడు. అంతేగాక, కొందరు వ్యక్తులు వారికి వుండె నానారకాల మత నమ్మకాల దృష్ట్యా విషయాలను తెలుసుకోవడం జరుగుతుంది. ఈ విధమైన జ్ఞానాన్ని గూడ స్పష్టమైనదని, నిష్కళంకమైనదని

చెప్పలేము. కాని అసలుసిసలైన తాత్త్విక జిజ్ఞాస వివేచనపై నిలుస్తుంది. దీనిని వివేచనాత్మక ప్రక్రియ అనవచ్చు. వివేచనకు పూర్వాభిప్రాయాలు గాని, పక్షపాతాలుగాని వుండవు. ఈ ధోరణి తార్కికంగా, శాస్త్రీయంగా జరుగుతుంది. అనగా సత్యాన్ని తెలుసుకోగోరే వ్యక్తి, సత్యాన్ని సత్యం కొరకే వెతుకుతాడు. తత్త్వశాస్త్రి ఈ అన్వేషణను హేతువు ద్వారా కొనసాగిస్తాడు. ఈ హేతువును ఆలోచనాధర్మాల ననుసరించి వాడతాడు. ఇక్కడ ఒక సత్యాన్ని మనం ప్రస్తావించాలి—తర్కశాస్త్రి వేరు తత్త్వశాస్త్రి వేరు. తార్కికంగా ఆలోచించే ప్రతివాడు తత్త్వశాస్త్రి కానేరడు. ఐతే తత్త్వశాస్త్రి ఖచ్చితంగా తర్కశాస్త్రిగూడ అయివుంటాడు (అయివుండాలి). తర్కశాస్త్రికి సత్యం అబద్ధం, మంచి చెడు అనే విషయాలతో పని ఉండదు. ఏది సరైనది (correct) ఏది సరియైనది కాదు అనే విషయం వరకే తన జిజ్ఞాస పరిమితమై ఉంటుంది. తత్త్వశాస్త్రి అట్లుగాక, సత్యాన్ని తెలిసికోవడానికి తర్కాన్ని వాడుకుంటాడు. వివేచనాత్మక పరిశీలనలో తర్కం ఒక సాధనంగా పనిచేస్తుంది. వివేచనాత్మక ఆలోచనా ధోరణిని కళంకంలేని (clear & distinct) ఆలోచన అంటారు. అది తత్త్వశాస్త్ర ప్రత్యేకతను సూచిస్తుంది.



సి. తత్త్వశాస్త్రం సార్వత్రిక జిజ్ఞాసగా పనిచేస్తుంది. తాత్త్విక జిజ్ఞాస ఎవరో ఒక వ్యక్తిగాని, ఏదో ఒక స్థలానికిగాని పరిమితమైయుండదు. తత్త్వశాస్త్రం స్థానిక, ప్రత్యేక విషయాలను దృష్టిలో పెట్టుకోవచ్చునేమోగాని, ఆలోచనను ఆ ప్రత్యేక విషయాలకు తాకట్టు పెట్టదు. ఒకవైపు ప్రత్యేక పరిస్థితులకు, విషయాలకు అంశాలకు జవాబుగా ఉండడానికి ప్రయత్నిస్తూనే మరోవైపు ఆ పరిస్థితులను సార్వత్రిక సందర్భంలో ఆలోచిస్తుంది; వివరిస్తుంది. అనగా సార్వత్రిక పరిష్కారాలలో ప్రత్యేక సమస్యలకు పరిష్కారం దొరికేటట్లుగా విషయాన్ని పరిశీలిస్తుంది. అనగా తత్త్వశాస్త్రమెల్లప్పుడూ సామస్త్య (holistic) దృక్పథాన్నే పాటిస్తుంది. మానవ సమస్యను మానవులందరికి సరిపోయే విధంగా వివరించ ప్రయత్నిస్తుంది. ఆ విధంగానే అర్థం చేసుకుంటుంది. వ్యక్తుల, సమాజాల, ప్రత్యేక

సమస్యలలోనే సామాన్యతను సార్వత్రికతను తత్త్వశాస్త్రం స్పందిస్తుంది. తత్త్వశాస్త్ర విషయం ప్రపంచంలోని మానవులందరికి సరిపోయే జవాబులను, వివరణలను, విశ్లేషణలను అందజేయ ప్రయత్నిస్తుంది. సార్వత్రికత (universality) లేని తత్త్వశాస్త్రం తత్త్వశాస్త్రమేకాదు.

డి. సార్వత్రికతకు అనుబంధమైన మరొక తాత్త్విక ప్రత్యేకత భావాత్మకత (conceptuality). వస్తువుల, లేక విషయాల్లోని సామాన్య గుణాన్ని ప్రత్యేకించి, ఆ సార్వత్రిక భావాల దృష్టిలో విషయాలను పరిశీలన చేయడాన్ని భావాత్మక పరిశీలన అంటారు. భావాత్మకతలో ప్రత్యేక వ్యక్తులు, వస్తువులు, భవాలు మేళవించబడతాయి ఉ॥ ప్రపంచంలో ఎంతో మంది మనుషులు వున్నారు. ఈ మనుషులందరిలోని సామాన్య లక్షణాన్ని బట్టి మానవుని ప్రత్యేకతను నిర్ణయిస్తాము. ఇతర జీవులకు వేరుగావుండె ఆ లక్షణమే మానవునికి ప్రత్యేకంగా ఎంచబడుతుంది. భావాత్మకీకరణ మనేది తత్త్వశాస్త్రంలో చాల కీలకమైన ప్రక్రియగా పనిచేస్తుంది. దీని ప్రకారం వస్తువులు లేక వ్యక్తులు పైకి (బాహ్యంగా) ఎట్లా కనిపిస్తారో అనే దానిని బట్టి గాక, ఆ వ్యక్తుల లేక వస్తువులలో అంతర్గతంగా వుండె సామాన్య లక్షణాలను గుర్తించడం తత్త్వశాస్త్రపు విధులలో ముఖ్యమైనది. బహుళత్వంలో నిండివుండే ప్రపంచం వెనక ఐక్యపర్చే గుణాలు (unifying principles), సూత్రాలేమైనావుంటే వాటిని ఈ ప్రక్రియలో తెలుసుకో గలుగుతాము. ఇట్లు తత్త్వశాస్త్రపు ముఖ్యలక్ష్యాలలో ఒకటైన ఐక్యపర్చే ప్రయత్నం సఫలమౌతుంది. అనగా సమగ్ర దృక్పథం రూపొందుతుంది.

ఇ. అనిబద్ధత (non commital attitude) తత్త్వశాస్త్రపు జిజ్ఞాసలో మరొక ప్రత్యేకమైన విషయం. బహుశ దీనిని అతి కీలకమైన విషయమని గూడ చెప్పవచ్చు. ఇదే రైటు లేక ఇదే సత్యం లేక అదే మంచి లేక అదే అబద్ధం అనే ధోరణిని తత్త్వశాస్త్రం నిరశిస్తుంది. అనగా ఒక అభిప్రాయాన్ని సరియైనదని ముందుగానే ఒప్పుకొని దానికొరకు అంకితమై,

దానిని గుడ్డిగా సమర్థించి బలపర్చే ధోరణి తాత్త్విక జిజ్ఞాసకు వ్యతిరేకం. అయితే అదే సమర్థనను తార్కికంగా జరిగించడంలో తాత్త్విక స్వభావం ఇమిడి వుంటుంది. ఉ॥ ప్రపంచంలో ఎన్నెన్నో మతాలు ఉన్నాయి. ఈ మతాలలో ఒక దానికి కట్టుబడివుండి, నిష్పక్షపాత తత్త్వశాస్త్రజ్ఞుడుగా వుండడమనేది అసాధ్యం. అనగా తానంగీకరించిన మతాన్ని సమర్థించడానికి ఆలోచనను వివేచనను వాడుకొనడాన్ని బట్టి తత్త్వశాస్త్రజ్ఞుడిగా చెలామణి అవడంలో దోషంలేదు. అలాంటి వారిని మతతత్త్వ శాస్త్రజ్ఞులంటారు. కాని ఈ తత్త్వశాస్త్రిల్లో అన్వేషణ, నిష్పక్షపాత పరిశీలన, శాస్త్రీయ అధ్యయనం మొదలగు వాటికి ఏ మాత్రం చోటు వుండదు. విశాలతకు, విమర్శకు తావుండదు. కొత్త సత్యాలను కనుగొనడానికి చోటివ్వదు. ఆ ధోరణి మూసివేయబడ్డ పుస్తకం లాంటిది (closed text book). సరియైన శాస్త్రిజ్ఞుడు ఏ ఒక్క భావానికి కట్టుబడి వుండడు. దానికి శాశ్వతత్వాన్ని అపాదించడు; తన అన్వేషణా ఫలితంగా కనుగొనబడిన సత్యాలను మాత్రమే సత్యమైనవిగా ఒప్పుకుంటాడు. ఐతే, వాటిని శాశ్వత పరిష్కారాలుగా మాత్రం అంగీకరించడు. అంతేగాక ఆ తరువాత కనుగొనబడే సరికొత్త సత్యాలకై వెతుకతాడు. వాటిని స్వీకరించడానికి ఎల్లప్పుడు సంసిద్ధుడుగా వుంటాడు. దీనినే నిష్పక్షపాత లేక విశాలధోరణి అంటాము. ఈ ధోరణిలో జరిగే తాత్త్విక అన్వేషణను బహిరంగ పుస్తకమని (open text book) చెప్పవచ్చు. ఈ సందర్భంలోనె తత్త్వశాస్త్రపు శాస్త్రీయ దృక్పథం వ్యక్తమౌతుంది.

ఎఫ్. వీటితో బాటు తత్తశాస్త్రపు పరిశీలనలో ప్రముఖపాత్ర వహించేది స్వేచ్ఛ (freedom). అన్ని స్వేచ్ఛల కంటె, మానశిక లేక ప్రజ్ఞ (intellect)తో గూడిన స్వేచ్ఛ తాత్త్విక అన్వేషణకు చాల అవసరం, ముఖ్యంగూడ. సత్యాన్ని సత్యంగా, వున్నది వున్నట్లుగా చెప్పలేనివాడు తత్త్వశాస్త్రడుగా పరిగణించబడడానికి యోగ్యుడు కాడు. ఏ సమాజంలోనైనా యదార్థమైన తత్త్వశాస్త్రజ్ఞుడుగా వుండడం చాల క్లిష్టమైన విషయం. సాధారణంగా తత్త్వశాస్త్రజ్ఞులు తాము జీవిస్తున్నా కాలంలోని మతభావాలు,

విలువలను సమర్ధించడానికో, లేక ఆనాటి ప్రభుత్వాధికారాలు, రాజకీయ ధోరణులు, సాంఘిక ఆచారాలు మొదలగు వాటిని మెప్పించడానికో, లేక ఆనాటి అధికారాలను కష్టపెట్టకుండా వుండడానికో తత్త్వశాస్త్రిలు రాస్తుంటారు. ఈ ధోరణిలోనే కొన్నిసార్లు వాస్తవాలను మరుగుపర్చడం గూడ అప్పుడప్పుడు జరుగుతుంటుంది. మరికొన్నిసార్లు ఆనాటి పాలకశక్తులకు ప్రభుత్వాలకు భయపడి, సత్యాన్ని చెప్పకుండా తప్పించుకొన్న తత్త్వశాస్త్రజ్ఞులు చరిత్రలో చాలమంది వున్నారు. తాత్త్వికస్వతంత్రతను పూర్తిగా వాడి ప్రాణాలుకోల్పోయిన వారు గూడ లేకపోలేదు. నశ్చలిత తత్త్వశాస్త్రజ్ఞుడు వివేచనాత్మకంగా తాను కనుగొన్న విషయాలను స్వేచ్ఛగా బయలుపరుస్తాడు. ఇది త్వాత్తిక జిజ్ఞాసలోని మరొక ప్రత్యేకత.

జి. తత్త్వశాస్త్రజ్ఞుడు ధైర్యాన్ని (courage)తన జన్మహక్కుగా భావిస్తాడు. ధైర్యంలేని తత్త్వశాస్త్రజ్ఞుడు సమాజానికి, మానవ జాతికి విరోధి. ఎందుకంటే సత్యాన్ని చెప్పడానికి భయపడేవాడు సమాజాన్ని వెనక్కి నడిపించిన ద్రోహి అవుతాడు. ధైర్యం అందరికీ వుండవచ్చు. కాని సత్యాన్ని కనుగొనడం, కనుగొన్న సత్యాన్ని వున్నదివున్నట్లుగా వివరించడమనేది వాస్తవాన్ని గూర్చిన సరియైన అవగాహనవున్న తత్త్వశాస్త్రజ్ఞునికే సాధ్యమవుతుంది. ఆ ధైర్యం చాల విశిష్టమైనది; కోట్లమంది ప్రజలకు ఎదురుగా ఒక్క తత్త్వశాస్త్రిజ్ఞుణ్ణి నిలబెట్టుతుందీ ధైర్యం. అనగా తత్త్వశాస్త్రజ్ఞుడి అవగాహన కోట్లమంది అజ్ఞానాన్ని ఎదుర్కొంటుంది: అధిగమిస్తుంది; రూపు మాపుతుంది కూడ. అలాంటి తత్త్వశాస్త్రజ్ఞులు లేని సమాజం తిరోగమన పథంలో పతనమైపోతుంది, అవిరమైన తాత్త్వక ధైర్యం సమాజానికెంతో ఉపయోగం.

ఎచ్. ప్రశ్నించడం (questioning), అనుమానించడం (doubting) తత్త్వశాస్త్రపు ప్రత్యేకతలలో మరొకటి. కనిపించేవాటిని గుడ్డిగా నిజమని నమ్మడం తాత్త్వక ధోరణికాదు. ఒక విషయాన్ని ఎదుర్కొన్నప్పుడు ఆ విషయం యొక్క వాస్తవికతను, సత్యాన్ని తెలుసుకోవాలనేది తాత్త్విక

జిజ్ఞాసను సూచిస్తుంది. తెలుసుకోవడమంటే దేనిని తెలుసుకోవాలనుకుంటామో, దాని స్వభావాన్ని, సత్యాన్ని, గుణాన్ని గురించి ప్రశ్నించడమే అవుతుంది. ఇది ఎందుకు ఇట్లు వుంది? అది ఎందుకు మరో రీతిగా వుండకూడదు? అని ప్రశ్నించడం తత్త్వశాస్త్ర ధోరణి. వాస్తవమంటె ఏమిటి? జీవిత అర్థమేమి? ప్రపంచమెట్లా వచ్చింది? లోకానికి మూలమేది? మరణమంటె ఏమిటి దేవుడనగానేమి, మానవ జీవితంలో వీటన్నింటి పాత్ర ఏమి? అనే మొదలగు ప్రశ్నలను తత్త్వశాస్త్రి అడుగుతుంటాడు. అంతేగాక అంతకు పూర్వమే ఇయ్యబడ్డ రకరకాల జవాబులను అనుమానిస్తుంటాడు కూడ. కాబట్టి అనుమానించడం, ప్రశ్నించడం అనేవి తెలుసుకోవడంలో భాగాలుగా పని చేస్తాయి. అనగా విషయాలను నమ్మడానికి ముందు అనుమానించడం తాత్త్విక పద్ధతులలో ఒకటి. అందువల్లనే అనుమానించడమనేది తత్త్వశాస్త్రంలో ఒక సుగుణంగా ఎంచబడింది. జ్ఞానార్జనలో అది ఒక ముఖ్య పాత్రను వహిస్తుంది.

ఐ. తాత్త్విక అన్వేషణ, షరతులు లేనిదిగా ఎంచబడుతుంది. (unconditional). అనగా సత్యాన్ని సత్యంకొరకే వెదుకుతుంది. దీనిని ఒక రకమైన షరతుల్లేని (నిరుపాధిక) అన్వేషణ అనవచ్చు ఐతే, కొన్ని ప్రత్యేక పరిస్థితుల స్వభావంవలన కూడ తాత్త్వికంగా ఆలోచించడానికి ప్రోద్బలం చేయబడేవారు కొందరుంటారు. ఇక్కడ తత్త్వశాస్త్రం సమస్యల పరిష్కార మార్గంగా వాడుకోబడుతుంది. ఈ సందర్భంలో వ్యక్తిగత సమస్యలు సామాన్యీకరించబడే అవకాశాలు లేక పోలేదు; లేదా ఒక ప్రత్యేకమైన సామాజిక సమస్య, సారస్వతిక సమస్యవైపుకు తత్త్వశాస్త్రజ్ఞుణ్ణి నెట్టె పరిస్థితి గూడ లేకపోలేదు. ఏది ఎట్లైనా ఇక్కడ తత్త్వశాస్త్రం ఒక లక్ష్యసాధనగా పనిచేస్తుంది. ఉద్దేశాలు లక్ష్యాలు తత్త్వశాస్త్రాన్ని ప్రభావితం చేస్తాయి. ఈ పరిష్కార పరిధిలోనే తత్త్వశాస్త్రం ఒక వృత్తి పరంగా కూడ రూపొందుతుంది. ఒక వ్యాపారిలాగా, ఒక కళాకారిలాగా, ఒక విలాగా, నీతిబోధకుడిగా గాక వాస్తవాన్నంతటిని ఎల్లప్పుడూ పరీక్షించే ప్రేక్షకుడిలాగా వాస్తవాన్ని పరిశీలన చేయడం తత్త్వశాస్త్రజ్ఞుడి స్వభావం. పక్షపాత వైఖరిలో

గాక, శాస్త్రీయ దృక్పథంతో అధ్యయనం చేయడం తాత్త్వికాన్వేషణా ప్రత్యేకత. ఒకప్పుడు పదార్థ సంబంధమైన భౌతిక ప్రపంచ ఆద్యంతాలు మొదలైనవి సమస్యలుగా వున్నవి. ఈనాడు మారుతున్న సాంఘిక ఆచారాలు, రాజకీయ వ్యవస్థలు, మారుతున్న ప్రపంచాలు, మారుతున్న నీతులు, మారుతున్న వాఙ్మయ ప్రమాణాలు మొదలైనవి తాత్త్విక చర్చనీయాంశాలుగా తయారయ్యాయి. జీవితం, విలువలు, జీవిత అర్థం, జీవిత ఆద్యంతం మొదలగు వాటిని గురించి తత్త్వశాస్త్రం చర్చిస్తుంది. ఈ పరిధిలో పరిణామము. అభివృద్ధి, మనస్సు, ప్రవర్తన, సమాజం, మొదలగు అంశాలు ముఖ్యమైనవిగా ముందుకొచ్చాయి. ఈ విధమైన ప్రశ్నలనడగడం, వాటిని ప్రతిబింబించడం (reflect) శాస్త్రీయ పద్ధతిలో అధ్యయనం చేయడం, వాటికి జవాబులియ్య ప్రయత్నించడం మొదలగు కార్యాలే తత్త్వశాస్త్రం.

# 3

# తత్త్వశాస్త్ర ఉద్భవం, ఉపయోగం

## 1. ఉద్భవం :

ఎ. ఒక వ్యక్తిలో తాత్త్విక జిజ్ఞాస ఎన్నెన్నో రకాలుగా ఎన్నో సందర్భాలలో ఉద్భవిస్తుంది. కొన్నిసార్లు వ్యక్తిగత పరిస్థితులు, మరికొన్నిసార్లు సామాజిక పరిస్థితులు తాత్త్విక జిజ్ఞాసకు దారితీస్తాయి. వ్యక్తిగత ధోరణిలో వ్యక్తి తనను గురించి తాను చేసే ఆలోచన, తన ప్రయత్నాలు, తన కష్టసుఖాలు, లాభనష్టాలు, తన నమ్మకాలు, అవగాహనలు మొదలైనవి ముడిపదార్థాలుగాను, ప్రేరణ శక్తులుగాను పనిచేస్తాయి. వ్యక్తిగత జీవితాలలో ఓటమిని, బాధను, నిస్సహాయతను, నిరాశను, మొదలగువాటిని ఎదుర్కొన్నప్పుడు మానశికంగా కలత పెట్టబడి, మనిషంటే ఏమిటి, జీవితమంటే ఏమిటని, మనిషి తీవ్రంగా ఆలోచించడం మొదలుపెడతాడు. ఈ పరిస్థితుల్లోనే జీవిత అర్థాన్ని గురించి ఆలోచించ ప్రారంభిస్తాడు. కొన్నిసార్లు తన మానశిక శక్తికసాధ్యమైన పరిస్థితి దెదుర్కొన్నప్పుడు తత్త్వశాస్త్ర ధోరణులు బయల్పడతాయి. వ్యక్తియొక్క మనుగడ, తన సాంస్కృతిక భూమిక, తన అభిరుచులు, మానశిక వైకల్యం మొదలైనవిగూడ బలంగా ప్రభావితం చేస్తాయి. అయితే సమాజిక లేక బాహ్యాత్మక ధోరణిలో బాహ్యప్రపంచం అనగా ప్రకృతి, ప్రకృతిలోని రకరకాల జీవులు, మరి విశేషంగా మానవ సమాజం, వీటన్నింటి మధ్య జరిగే పరిణామాలు, అంతర్గత కార్యాచరణలు, మానవ జీవితంపై వాటి ప్రభావాలు మొదలైనవి తాత్త్విక ఆలోచనా ఉద్భవానికి దోహదమిస్తాయి. బాహ్యాత్మక ప్రేరణా ఫలితమైన

తాత్త్విక జిజ్ఞాస సార్వత్రిక ప్రమాణాలను, సామాజిక అంశాలను దృష్టిలో పెట్టుకుంటుంది. సాంఘిక బహిష్కృతులు, సాంఘిక అన్యాయాలకు గురియైనవారు, సమాజంలో సమానత్వానికి, గుర్తింపుకు దూరమైనవారు, సమాజాన్ని గురించి, మానవ మానసిక స్వభావాలను గురించి ఆలోచించడానికి ప్రోద్బలం చేయబడతాయి; యుద్ధాలవలన కలిగే జీవిత నష్టాలు, మార్పులు కుటుంబ చీలికలు, ప్రవాసాలు మొదలైనవి సాధారణ ఆలోచనా స్థాయి నుండి వ్యక్తిని సార్వత్రిక స్థాయికి హెచ్చిస్తాయి. అంతేగాక, ఒక సమాజంలో కులపరంగా, మతపరంగా, భాషాపరంగా, ప్రాంతీయ ధోరణుల పర్యవసానంగా తలెత్తె సంఘర్షణలకు వెనక పనిచేసే శక్తులను గురించి మానవ సామరస్య అవసరతను గురించి, ఆ సామరస్యానికి తోడ్పడే మౌలిక ధర్మాలను గురించి, ఆలోచించడానికి వెతకడానికి దారి తీస్తాయి.

బి. మనిషిని ప్రతిక్షణం ఎదుర్కొనేది ఆర్థిక అంశం, ఇది కొందరికి అసలు సమస్యే కాకపోవచ్చు. కాని మరికొందరికి ఇదే అసలు సిసలైన సమస్యగా వుంటుంది. కొందరు కష్టపడతారు; కాని న్యాయం జరగదు. జీవితాంతం కృషిచేస్తారు. గాని వారికి ఉత్పాదక సాధనాలుండవు. జీవిత మంతా పేదరికంలోనే లేక, మధ్యతరగతి స్థాయిలోనో గడుపుతుంటారు. వీరికి పెట్టుబడి వుండదు; జీవితమంతా, ఆర్థిక వనరులు వున్నవారికి భయపడుతూ వారిక్రింద జీవిస్తుంటారు. స్వేచ్ఛామానవ జీవితానికి, అర్థవంతమైన భవిష్యత్తుకు ఎంతో దూరంగా బ్రతుకుతుంటారు. ఈలాంటి జీవిత వలయంలో చిక్కుకున్న వారిలో కొందరు అందులోనే మగ్గిపోతుంటారు; మరికొందరు, ఈ మూలకారణాలను తుడిచివేయడానికి కృషి చేస్తారు. ఇట్లు ప్రజల జీవితాన్ని భవిష్యత్తును, ప్రపంచాన్ని గురించి ఆలోచించడానికి పరిస్థితులే బలవంతపెడతాయి. ఈ ఆలోచనకు రాపిడి కలుగజేసే వాస్తవాలు కొన్ని వున్నవి. ఉ॥ శ్రమజీవులను దోపిడి చేస్తున్నా వారికి ఏమి జరగనట్లె ఒకవైపు ధనస్వాములు మరొక వైపు ప్రభుత్వాలు వ్యవహరిస్తుంటారు. బట్టబయలుగా పట్టపగలే జరిగిపోతూ వుండే ఈ

అన్యాయాన్ని చూస్తూ గూడా నీతులు చెప్పే మత బోధకులుగాని పెద్ద మనుషులుగా సమాజంలో ఎంచబడుతున్న వారుగాని, అంతా ప్రశాంతంగా వుందన్నట్లుగానే ప్రవర్తిస్తుంటారు. అసలు సమాజంలో బాధ్యతగలవారని ఎంచబడేవారిలో అధిక సంఖ్యాకులు, ఈ పరిస్థితిని చూచి చూడనట్లుగా జీవిస్తుంటారు. ఈలాంటి సత్యాలు మానవత్వం గలిగిన మనుషుల్ని ఆలోచనలో పడవేస్తుంటాయి; వారి ఆలోచనకు పదును పెడతాయికూడ. అంతేగాక ఈ పరిస్థితికి మూలాన్ని వెదకడానికి ప్రోత్సహిస్తారు.

సి. వీటితో బాటు సాంస్కృతిక, సంప్రదాయక పరిస్థితులు గూడ మనిషిని తాత్త్విక జిజ్ఞాసకు నడిపిస్తాయి. కొన్నిసార్లు సంప్రదాయక ఆచార్య అల వాట్లు, నమ్మకాలు, జీవిత మనుగడకు ఎదురు నిలుస్తుంటాయి. మరకొన్ని సందర్భాలలో అభివృద్ధికి అడ్డువస్తాయి. సాంప్రదాయక సంస్కృతిచే ప్రభావితులైనవారు, సంప్రదాయాలను అక్షరానుసారంగా అనుసరించ యత్నించి, జీవితంలో నానాయాతనలు పడేవారున్నారు. ఈ పరిస్థితుల్లో సంప్రదాయాలను గురించి, సంతరించుకున్న మతభావాలను గురించి, వాటి మంచి చెడులను గురించి మనిషి ఆలోచించ ప్రారంభిస్తాడు. అంతేగాక, సాంస్కృతికంగా సంతరించుకున్న ఈ సంప్రదాయాలను అధిగమించడానికి మార్చడానికి, పునర్వ్యవహరించడానికి చేసే ప్రయత్నాలలో వ్యక్తిలో తాత్త్విక చింతన జనిస్తుంది, బలపడుతుంది; అధికమౌతుందికూడ. కొన్ని సార్లు తాము నమ్మిన నమ్మకాలకు, పాటించె విలువలకు, సంప్రదాయాలకు భంగం వాటిల్లగలదని అభిప్రాయపడినప్పుడు ఆ మతాలకు, సంప్రదాయా లకు సంబంధించిన కొందరు వాటిని హేతువాదపూర్వకంగా, తార్కికంగా సమర్థించయత్నించే ప్రయత్నంలో తాత్త్వికచింతనకు అలవాటైపోతారు. మానవత్వాన్ని కలిగిన మానవతా వాదులు కొందరు మానవ విలువలను పరిరక్షించడానికి, అమానవత్వ ప్రభుత్వాల క్రింద అమానవత్వ పర్చబడెవారికి, నిరీక్షణలేని వారికి, జీవితగమ్యం తెలియక గుండెలు చెదరిన వారికి, ఒక మార్గాన్ని చూపెట్టే ప్రయత్నంలో వ్యక్తులు తాత్త్విక

చింతనను పెంపొందించుకుంటారు. ఇక్కడ, సామాజిక స్పృహ, చింతన తాత్త్విక ధోరణికి దారితీస్తున్నట్లు చూడగలం.

డి. ప్రపంచమర్మాన్ని, ధర్మాన్ని తెలుసుకోవాలనే అభిలాష కూడ మనుషుల్లో తాత్త్విక చింతనను రేకెత్తిస్తుంది. ప్రకృతి, చరిత్ర, వీటిలో జరిగే పరిణామాలు, ఈ ప్రక్రియల వెనుకనుండె సూత్రాలను తెలుసుకోగోరే వారిలో తాత్త్విక జిజ్ఞాస చోటు చేసుకొంటుంది. ఇవన్నీ సామాజిక తాత్త్వికపరిష్కారాల అన్వేషణను ప్రోత్సహిస్తాయి. తత్త్వశాస్త్రపు చరిత్రం తటిలో మనం గమనించవలసిన విచిత్రమైన విషయమేమంటే, తత్త్వ శాస్త్రపు అవసరతను గుర్తించిన వారు తత్త్వశాస్త్రాన్ని రాయలేదు. సాధారణంగా ఏ మానవ పరిస్థితులు జీవితాన్ని గురించి ఆలోచించడానికి మనుష్యులను పోద్బలం చేస్తాయో ఆ పరిస్థితులతో సంబంధంలేనివారు ఎక్కువగా తత్త్వశాస్త్రాన్ని వ్రాశారు. డబ్బున్న వారో, లేక చాలినంత తీరుబడివున్న వారో లేక పాలక వర్గాలచేత పోషించబడినవారో ఎక్కువగా తత్త్వశాస్త్రాలు రాశారు. ఈలాంటివారు వ్రాసే తత్త్వశాస్త్రాల్లో ప్రజలపట్ల వుండవలసిన బాధకంటే పాలకులపట్ల విధేయత, సమస్యల పరిష్కారంకంటే తెలుసుకోవాలనే అభిరుచి, మొదలగు విషయాలు ఎక్కువగా కొట్టవచ్చినటు కనిపిస్తుంటాయి. అనగా కళ కళకొరకేనన్నట్లు వీరి నినాదం కూడ తత్త్వశాస్త్రంకొరకే అన్నట్లు వుంటుంది.

## 2. ఉపయోగము

ఎ. ఏ విధమైన పూర్వాభిప్రాయాలు లేకుండా, పాక్షిక దృష్టిలో కాకుండా సదుద్దేశంతో శాస్త్రీయంగా తత్త్వశాస్త్రాన్ని అధ్యయనం చేసిన వ్యక్తిలో, నిస్సందేహంగా ఒక నిర్దుష్టమైన, ఉన్నతమైన ప్రాపంచిక అవగాహన రూపొందుతుంది. ఏదో ఒక రకమైన అవగాహన అందరికీ వుంటుంది. అది స్వాభావికంగా రూపొందుతుంది. దానికొరకై ప్రత్యేకంగా యోగా

భ్యాసం చేయనవసరంలేదు. కాని ఒక అత్యున్నతమైన అవగాహన రావాలంటె సార్వత్రిక జిజ్ఞాస మీద నిలబడే తత్త్వశాస్త్రాన్ని అధ్యయనం చేయడం అవసరం. ఈ జిజ్ఞాస కొందరిలో పరిస్థితులనుబట్టి మరికొందరిలో అభ్యాస ఫలితంగా జనిస్తుంది. తత్త్వశాస్త్రం చదవకుండానే ప్రాపంచిక అవగాహనలు వ్యక్తులలో రావచ్చు. ఐతే అది లోకాన్ని ముంచేదా లేక తేల్చేదా అనే దానినిబట్టి అది తాత్త్విక ప్రభావితమైనదా కాదా అని నిర్ణయించవచ్చు. ప్రపంచంలోని అందరి మానవుల వివేచనాత్మకమైన జీవన శైలికి అంకితమై యుండడంలో తాత్త్విక ప్రాపంచిక అవగాహన యొక్క ప్రత్యేకత ఇమిడి వుంటుంది. ఏ వివేచన వలన మనిషిలోని మానవత్వం విశిష్టమైనదిగా ఎంచబడుతుందో ఆ మానవత్వాన్ని కాపాడి, పెంపొందించి, దానికి రాపిడి పెట్టేదే తాత్త్విక ధోరణి. ఈ అవగాహన వలన మనిషి అర్థవంతమైన జీవితాన్ని జీవించగలుగుతాడు.

## బి. సమాజమార్పు :

ఉత్తమమైన, నిర్మాణాత్మకమైన, సార్వత్రిక దృక్పథం కలిగిన వ్యక్తి ఆ ధోరణిలో వుండవలసిన సమాజస్థాపనకై కృషి చేస్తాడు. ఈ లక్ష్య సాధనలో వ్యూహాలు వాటి రూపాలు మారవచ్చు. కాని లక్ష్యం ఒక్కటే. ఒకవేళ సమకాలీన సమాజం, తాను శాస్త్రీయంగా రూపొందించిన ప్రాపంచిక అవగాహనకు భేదించినా, ఆ స్థాయికి తక్కువలో వున్నా, అలాంటి సమాజాన్ని మార్చడానికి కావలసిన మార్గదర్శిక ఆలోచనను సమాజానికి అందిస్తాడు. యదార్థమైన తత్త్వశాస్త్రి సమాజంలో జరిగే పరిణామాలకు ముఖావంగా వుండదు. వుంటె తన తాత్త్విక స్థాయిని శంకించవలసివుంటుంది. పైగా కేవలం తనకొరకే, తన స్వంత ప్రజల కొరకే, లేక తన వర్గాభివృద్ధి కొరకే తత్త్వశాస్త్రాన్ని సాధనంగా వాడే వానిమీద కూడ నిఘా వుంచవలసిన అవసరత ఎంతైనావుంది.

## సి. అధిగమించె జీవనశైలి :

సమాజంలో ఎన్నెన్నో అల్లకల్లోలాలు లేవవచ్చు. మానవ సంబంధాలలో ఆపశృతులు ఆవిర్భవించవచ్చు. మానవ పరిస్థితులలో తుఫానులు చెలరేగవచ్చు. అయితే అసలు సిసలైన తత్త్వశాస్త్రజ్ఞుడు వాటిని గురించి ఆశ్చర్యపడడు, ఆ సమస్యల నుండి దూరంగా పారిపోడు. ఈ అల్లకల్లోలాలవెనక, అరాచకాలవెనక, మానవజాతికి ప్రశాంతతను, సమైక్యతను సామరస్యాన్ని ఇవ్వగల సూత్రాలను కనుగొనడంలో నిమగ్నుడై వుంటాడు తత్త్వశాస్త్రి. ఐతే ఈ కృషిలో జయించలేనంతటి సమస్యను గూడ ఎదుర్కొంటాడు; గాని రాజీపడడు. జీవితసర్దుబాటు వేరు, రాజీపడదం వేరు. జీవిత సమస్యలను ఎదుర్కొంటూ, అధిగమిస్తూ, పరిష్కరించుకొంటూ, జీవితాన్ని సాగిస్తాడు. కాని సమస్యలకు ఆహుతికాడు.

క్లుప్తంగా చెప్పాలంటే సమాజమెదుర్కొనే చీలిక శక్తులను వికేంద్రీకరణ ధోరణులను, అరాచక శక్తులను ఐక్యపరచె శక్తిగా కృషి చేయగలడు.

## డి. సరికొత్త భవిష్యత్తుకు పునాదులు :

తత్త్వశాస్త్రి ఎల్లప్పుడూ భవిష్యత్ మనిషిగానే వుంటుంటాడు. అతడు రేపటి మనిషి. గతం క్రింద నలిగిపోడానికి ఒప్పుకోడు. ప్రస్తుతానికి ఆహుతి కాడు. ఏలాంటి సమాజాన్ని స్థాపించుకోవడం కోరదగిందో ఆ సత్యాన్ని సృష్టీకరిస్తాడు. ఈనాటి విలువలు, సాంప్రదాయాలు, మత భావాలు, రాజకీయ పోకడలు, సంస్కృతి, మొదలైనవి మానవజాతికి వినాశకరమని గుర్తిస్తే వాటిని తిరస్కరించి, నివారించి, ప్రతిఘటించి, సరికొత్త విలువలకు, సంస్కృతికి పునాదులు వేస్తాడు. మానవుడు ఏమికాగలడో, ఆ కాగల శక్తిని గుర్తించి, ఆ గుర్తించిన భవిష్యత్తును సిద్ధంపజేసుకోడానికి

పునాదులు వేస్తాడు. ఇట్లు కొత్త భవిష్యత్తుకు పునాదులు వేయడంలో సమకాలీన, తిరోగమన, అజ్ఞాన ప్రజా ఉగ్రతకు గురియౌతాడు. కాని హ్రస్వదృష్టిగల కోట్లాది మంది సామాన్య మానవుల కెదురుగా ఒక్కడి గానే నిలబడి, భవిష్యత్‌ను వూహించి, చిత్రించి, ప్రచురించి నిలబడ గలిగేది ఒక్క తత్వశాస్త్రజ్ఞుడే. ఐతే, భవిష్యత్తు గమనాన్ని విశ్లేషిస్తాడే గాని, దానిని సాధించే స్వేచ్ఛా బాధ్యతలు సమాజానికి, సమాజంలోని కీలక ప్రభావిత శక్తులకు వదిలివేస్తాడు. 2+2 = 4 అన్నట్లు, ఈ సమస్యకు ఇది పరిష్కారం, ఆ ప్రశ్నకు అది జవాబనే క్షణిక, నిర్ణీత జవాబులనిచ్చి, సమాజపు సృజనాత్మకతను చంపివేయడం తాత్త్వికధోరణికాదు.

4

# వివిధరకాల తత్త్వశాస్త్రాలు

## ఎ. భావవాద తత్త్వశాస్త్రం : (IDEALISM)

కేవలం వివేచనను (reason) సాధనంగా అంగీకరించి వాస్తవాన్ని ఒక వివేచనాత్మకమైనదిగా ఎంచి, దానిని ఏదో ఒక కేవల భావం (absolute idea) పరిధిలోనో లేక భావాల పరిధిలోనో అర్థంచేసుకొనే ధోరణిని భావవాదమనవచ్చు. ఇక్కడ భావం, ఆలోచన, ఆత్మ లేక దేవుడు అనే పదాలన్నింటిని దాదాపుగా ఒకే అర్థంతో వాడతారు. ఉ॥ ప్లేటో, ప్రపంచాన్ని భావాల వాస్తవం దృష్ట్యా వివరిస్తాడు. కాంట్ ఇంద్రియాతీతమైన వాస్తవం దృష్ట్యా వివరిస్తాడు. హెగెల్ ఒక కేవల ఆలోచన (absolute thought) లేక ఆత్మ అంటాడు. తాత్త్విక ప్రపంచంలోనే గాక మత పరిధిలో ఆలోచించే వారిలోనూ భావవాదులుండ వచ్చు. మత పరిధిలో ఆలోచించే వారు ప్రపంచానికి మూలం దేవుడు లేక దైవాలు అంటారు. మరొకవైపు లౌకిక పరిధిలో వివేచనాత్మకంగా ఆలోచించేవారు కేవల ఆత్మ కేవల ఆలోచన, అంతిమ వాస్తవం, అనే మొదలగు మతరహిత పదాలను వాడతారు. మొత్తానికి పదాలు వేరైనా భావం మాత్రం ఒక్కటే. ప్రపంచం, అనగా భౌతిక ప్రపంచంతో సహా, అప్రాకృతికమైన (non-naturalistic) శక్తులవలననో, సూత్రాలవలననో, నడిపించబడు తుందనే వాదాలన్నీ భావ వాదం క్రిందికి వస్తాయి.

భావవాదంలో వస్త్వాశ్రియ భావవాదం, ఆత్మాశ్రయ భావవాదం కేవల భావవాదమనేవి మూడు రకాలున్నవి. వస్త్వాశ్రయ భావవాదం

ప్రకారం, వాస్తవానికి మూలమైన ఆలోచన వ్యక్తికి బయట వుంటుంది. అనగా వ్యక్తికి వేరుగా వుండి వ్యక్తిని ప్రభావితం చేసేదిగా పని చేస్తుంది ఆత్మ. ఆత్మాశ్రయ భావవాదంలో వ్యక్తియొక్క మనస్సు ప్రముఖపాత్ర వహిస్తుంది. వాస్తవాన్ని గురించిన అవగాహన స్వఆత్మ గ్రహింపును బట్టి వుంటుంది. ఇక్కడ కూడ వ్యక్తియొక్క మనస్సు, ఆత్మ, గ్రహింపు మొదలగునవి వాస్తవాన్ని నిర్ణయిస్తాయి. కేవల భావవాదం ప్రకారం వాస్తవం వ్యక్తికి బయట, లోపట గూడా పనిచేస్తూ వుంటుంది. అనగా వాస్తవం యొక్క నిర్మాణమే ఆలోచన. దాని ప్రక్రియ, దాని పురోగమనం దాని పరిణామం, దాని ప్రత్యక్షత మొదలగునవన్నీ ఆలోచనా రూపంలో వ్యక్తమౌతుంటాయి. కేవల ఆలోచన మానవ ఆలోచన ద్వారా ఆలోచిస్తుంది; మానవ కార్యాల ద్వారా పనిచేస్తుంది. మానవ చరిత్ర యావత్తు ఈ కేవల ఆలోచనా సంభూతమయి వుంటుంది. ఇక్కడ కేవల ఆలోచన, మానవ ఆలోచనలకు మధ్యవుండే సంబంధం గుణాత్మకంగా (qualitative) వుంటుంది.

ఈ విధంగా ప్రపంచాన్ని భావం, లేక ఆలోచన, లేక ఆత్మ, అనే వాటి దృష్ట్యా అర్థం చేసుకొని వివరించే తత్వశాస్త్రాలన్నింటిని భావవాద తత్వశాస్త్రాలంటారు.

## బి. భౌతికవాద తత్వశాస్త్రం (MATERIALISM)

కనిపించే పదార్థమే సమస్తానికి మూల వాస్తవమనేదే భౌతిక వాద తత్వశాస్త్రం. దీని ప్రకారం, ఆలోచనకు కూడ భౌతిక ప్రపంచమే కారణం. భౌతికవాదంలో కూడ పరిణామ భౌతిక వాదం, యాంత్రిక భౌతికవాదం, గతితార్కిక భౌతికవాదం, మానవతా భౌతికవాదం, మొదలగు వివిధ రకాల సిద్ధాంతాలు చాల వున్నవి. పరిణామ భౌతికవాదం ప్రకారం విశ్వం, అందులోవుండేదంతా ఎమీబా అనే పదార్థం నుండి జనించి క్రమక్రమంగా ఈనాటి మానవస్థాయి వరకు పరిణమించింది.

యాంత్రిక భౌతికవాదం ప్రకారం ప్రపంచమంతా ఏలాంటి లక్ష్యం లేని పదార్థంతో నిండి వుంటుంది. వీటిలో కొన్ని రకాల పదార్థాలు మరికొన్ని పదార్థాలతో కలిసినపుడు, సరికొత్త పదార్థాలను ఉత్పత్తి చేస్తాయి. ఈ ప్రక్రియ అంతా, ఏదో ఒక అవకాశాన్ని బట్టి అకస్మిక (accidental) సంబంధంగా జరుగుతుంటుంది. ఈ ప్రాపంచిక దృక్పథంలో ఒక లక్ష్యం గాని, ఒక అర్థంగాని వుండదు. గతితార్కిక భౌతికవాదం ప్రకారం ప్రపంచమంతా పదార్థం నుండి ఉద్భవించింది. పదార్థం మూల వాస్తవం. చరిత్రకు చరిత్రలో జరిగే సమస్త సంఘటనలకు పదార్థమే కారణం. ఐతే ఈ పదార్థంకొన్ని నిర్దుష్టమైన గతితార్కిక ధర్మాలననుసరించి నడుస్తుంది. ఈ అవగాహనలో సంఘర్షణ కీలక పాత్ర వహిస్తుంది. పదార్థవనరుల మార్పునుబట్టి సంస్కృతి, చరిత్ర జీవితం మొదలైనవి రూపొందించబడుతుంటాయి. ఈ సదర్భంలో ప్రకృతిలోను చరిత్రలోను వుండె గతితార్కిక ధర్మాలు, వ్యక్తికి వేరుగా (outside) పనిచేస్తుంటాయి.

మానవతా భౌతికవాదం ప్రకారం మానవుడు పదార్థంలో ఒక భాగమైవుండినా, పదార్థాన్ని ఒక సాధనంగా మానవుడే వాడగలడు. ఇక్కడ మానవత్వం ముఖ్యమైనదిగా ఎంచబడింది. పదార్థ వనరులన్నీ కలిగి వుండినా, మానవత్వంలేని జీవితం వ్యర్థమైనదని దీని భావన. మానవుడు మానవత్వం కలిగి జీవించడానికి పదార్థవనరులు తోడ్పడాలనేది మానవతా భౌతికవాదపు ఉద్ఘాటన.

## సి. అనుభవికవాద తత్త్వశాస్త్రం : (EMPIRICISM)

జీవితంగానీయండి బాహ్యప్రపంచంగానీయండి, వున్న వాస్తవమంతా, అనుభవ పరిధిలోనే అర్థం చేసుకోబడుతుంది. ఇక్కడ అర్థంచేసుకోడానికి తోడ్పడే సాధనాలు సంవేదనలు (sensations) ప్రత్యక్షత (perception) మొదలైనవి. ఇంగ్లండు దేశీయులైన జాన్‌లాక్, బెర్క్లీ, డేవిడ్ హ్యూమ్ అనేవారు ఈ వాదానికి మూలపురుషులుగా గుర్తించబడ్డారు. ఈ వాదన

ప్రకారం అనుభవానికి అతీతమైన వాటిని తెలుసుకోలేము. దీనికి మినహాయింపంటూ వుంటే అది ఒకటే వుంది. అది నమ్మకం. అనుభవికవాద తత్వశాస్త్రజ్ఞులందరూ ఒకే ధోరణిని సమర్థించలేదు. వీరిలో కొందరు నిరీక్షణ వాదులు, కొందరు (అజ్ఞేయ) నిరాశావాదులు, మరికొందరు రాడికల్ వాదులున్నారు.

## డి వ్యావహారికతా తత్త్వశాస్త్రం : (PRAGMATISM)

తత్వశాస్త్రం కేవలం బాహ్యాత్మకతనుండి (objective world) ఉద్భవించదు. దానికొక సాంఘికపని సాంఘిక మూలం వుంటుంది. సంప్రదాయ హేతువాదాన్ని అశాస్త్రీయ పద్ధతులను నిరాకరిస్తుంది తత్వశాస్త్రం. ఇది ముఖ్యంగా ప్రయోగాలమీద ఆధారపడుతుంది. ధ్యానాత్మక పద్ధతులను నిరాకరిస్తుంది. ఈ సిద్ధాంతం ప్రకారం సత్యమనేది ఒక ప్రత్యేక ప్రతిపత్తిగల వస్తువు (entity) కాదు; అది ఒక కార్యం లేక విధి (function). దీనివలన మన పరిసరంతో మనం సర్దుబాటు చేసికోగలుగుతాము. ఈ సిద్ధాంతం సంప్రదాయ తత్వశాస్త్రాన్ని ప్రయోగ ప్రమాణదృష్ట్యా పరిశీలిస్తుంది. సిద్ధాంతం యొక్క పనితనం (workability) ఇక్కడ ముఖ్యమైనదిగా ఎంచబడింది. అనగా ఒక సిద్ధాంతంగాని పద్ధతిగాని ఒక కార్యాన్ని సాధించడంలో, దోహదకారికాగల ప్రయోగాత్మకతను చాల కీలకమైనదిగా ఎంచుతారు. కాబట్టి ప్రతిఫలం సిద్ధాంతంయొక్క సత్యానికి సూచనగా పనిచేస్తుంది. ఏదైతే ఉపయోగార్థమైన పనిచేస్తుందో అదే సత్యమైనది. పరిసరాలతో చేసుకొనే సర్దుబాటులో జ్ఞానం ఇమిడివుంది. జ్ఞానం క్రియాత్మక ధోరణిని ప్రతిబింబిస్తుంది, సర్దుబాటు చేసుకొనే క్రియాశీల ప్రక్రియనే జ్ఞానమంటారు. ఇక్కడ జ్ఞానం, పని సమ్మేళనమై యుంటాయి. ఒక వ్యక్తి జ్ఞానాన్ని అమల్లో పెట్టి ప్రయోగాలు చేసేకొలది, మానవజాతికి ఎంతో మేలు చేయగలుగుతాడు. సామాన్యీకరణాలను, అమూర్త విలువలను, లక్ష్యాలను తిరస్కరించారీ తత్వశాస్త్రజ్ఞులు దైనందిన జీవిత సమస్యలు

ప్రత్యేకంగానే వ్యవహరించబడతాయి. అనుకరణ కాదు, క్రియాశీలత, గతిశీలత ప్రముఖమైనవిగా ఎంచబడినాయి. అభివృద్ధి, విజయం, లక్ష్యసాధన మొదలైనవి ముఖ్యమైనవి. సమాజాభివృద్ధి ఈ తత్త్వశాస్త్రపు లక్ష్యం.

## ౩. అస్తిత్వ తత్త్వశాస్త్రం (EXISTENTIALISM)

మానవ ప్రత్యేక అస్తిత్వానికి (ఉనికికి) ప్రథమస్థానమిస్తుంది తత్త్వశాస్త్రం. ఇక్కడ ఇప్పుడు జరుగుతూన్న చరిత్రను, జీవితాన్ని ముఖ్య అంశాలుగా గుర్తించింది. ఏనాడో ఎక్కడో జరుగబోయే విషయాల పట్ల అంత ఆసక్తి చూపదు. మానవ జీవిత పరిమితాన్ని (finitude) అవధులను, వాస్తవ సందర్భాలను దృష్టిలో పెట్టుకొని, జీవిత తత్త్వశాస్త్రాన్ని రూపొందిస్తుంది. ఈ తత్త్వశాస్త్రం, కేవలత్వాన్ని, వివేచనాత్మకతను, సార్వత్రీకరణాన్ని వ్యతిరేకిస్తుంది. వ్యక్తియొక్క స్వేచ్ఛ, బాధ్యత, తీర్మానాలు వ్యక్తిత్వానికి మానవ జీవితానికి మూలమని ఘోషిస్తుంది. మానవుడు భయం, విస్పృహ, నిరాశ, మరణం, ఆతృత మొదలగు వాటిచే ఆవరించబడి వుంటాడు. కాని, ఇవిగూడ జీవితంలో భాగస్వాములని చెబుతుంది తత్త్వశాస్త్రం. స్వచ్ఛమైన (authentic) మానవ జీవితం ఈ తత్త్వశాస్త్రపు లక్ష్యం. అర్థవంతమైన సందర్భమే స్వచ్ఛమైన జీవితానికి నిర్ణయ ప్రమాణం. ప్రతి అంశాన్ని అస్తిత్వ సందర్భంలోనే వివరిస్తుంది.

అస్తిత్వ తత్త్వశాస్త్రంలో ఆస్తికులు, నాస్తికులు అనే రెండు వర్గాలున్నారు. మరి కొందరు ఈ వర్గీకరణకు అతీతంగా వున్నారు. ఈ తత్త్వశాస్త్రం వ్యక్తి స్వంతంగా నిర్ణయాలు తీసుకోడానికి, చేసిన పనికి బాధ్యత వహించడానికి, దైనందిన జీవితంలోని సమస్యలను బేషరతుగా పరిష్కరించుకోడానికి తోడ్పడుతుంది. వ్యక్తిని ధైర్యవంతుడుగాను, క్రియాశీలకార్యసాధకుడుగాను, రూపొందిస్తుంది. ఫ్రెడరిక్ నీచె, సోరెన్ కిర్కెగార్డ్, జీన్‌పాల్‌సార్థ్, మార్టిన్ హైడగర్, ఆల్బర్ట్‌కాము, గాబ్రెల్ మార్సెల్ మొదలగువారు ఈ తత్త్వశాస్త్రానికి పునాదులు వేసి రూపుదిద్దారు.

## ఎఫ్. కాల్పనిక వాదశాస్త్రం (ROMANTICISM)

ఈ ధోరణి అనేకతత్త్వశాస్త్రాలకు సాంస్కృతిక భూమికగావుంటుంది. ఈ ఉద్యమం ప్రారంభంలో తత్త్వశాస్త్రంతో సంబంధం కలిగియుండక పోయినా రాజకీయాలపరంగాను రూసో ప్రభావ ఫలితంగాను ఒక తాత్త్విక ధోరణిగా రూపొంది, తత్త్వశాస్త్ర శాఖలలో ఒకటిగా అభివృద్ధి చెందింది.

ఆనాటికి సంతరించుకున్నా నైతిక, సౌందర్య ప్రమాణాలకు ఎదురు తిరగడంలో దీని ప్రత్యేకతను చూపించుకుంది. ఈ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన వారిలో రూస్సో ఒకడు. ఆనాటి ఫ్రాన్స్ దేశంలోని సంస్కారం గలవారు ఉద్రేక ధోరణిని, సానుభూతి పూర్వక ఉద్రేకాన్ని చాల అభినందించేవారు. బాగా సంతృప్తిపడాలంటె, ఉద్రేకం, బలీయంగాను, హింసాత్మకంగాను, ఆలోచనతో పనిలేనిదిగాను వుండాలనే వారు. సంవేదన శక్తిగల వ్యక్తి (person) మానవ విహీన లక్షణాలను, పరిస్థితులను చూసి వెంటనే కన్నీరు కారుస్తాడు. అలాంటి వ్యక్తి బాగా ఆలోచించి చేసిన కార్యక్రమాలపట్ల ఆసక్తి చూపడు. పేదవారు ధన వంతులకంటె సుగుణవంతులు (నీతిగలవారని) అని అభిప్రాయ పడ్డారీ తత్త్వశాస్త్ర ప్రభావితులు. దీనిని స్పృహ లేక సంవేదనా శక్తి పూజ అంటారు.

ఈ కాల్పనిక తత్త్వశాస్త్రజ్ఞులు నైతికకట్టుబాట్లు లేనివారుకారు. వారి నైతిక నిర్ణయాలు చాల తీవ్రంగా, పదునుగా వుంటాయి. ప్రాజ్ఞత, కుశలతలను అత్యుత్తమమైన సుగణాలుగా ఎంచారు. ఈ కాల్పనిక వాదశాస్త్ర ఉద్యమం వేరు, కాల్పనికవాద శాస్త్ర తిరుగుబాటు వేరు. వీరి తిరుగుబాటు పారిశ్రామికానికి, ఆధునిక ఆర్థిక వ్యవస్థకు గురిచేయబడింది. వీరు డబ్బుపిచ్చితో కూడిన ఆ ధోరణి తగినదికాదంటారు. కొంత కాలాని కిది జాతీయోద్యమాల రూపంలో తలెత్తింది. ఉపయోగాత్మక ప్రమాణాలకు బదులు సౌందర్య ప్రమాణాన్ని ప్రవేశపెట్టారు. ప్రేమజీవితాల్లో, యుద్ధాల్లో

కవిత్వంలో విరహవేదనల్లో ఈ ధోరణి ఎక్కువగా కనిపిస్తుంది. ఈ ఉద్యమం ముఖ్యంగా, వ్యక్తిని సాంఘిక ఆచారాల నుండి, సాంఘిక నైతిక కట్టుబాట్లు బంధాలనుండి విడుదల చేయాలని ఉద్దేశించింది. వ్యక్తిగత అభిరుచులకు, సంవేదనలకు, ఉద్రేకాలకు ప్రాధాన్యతనిస్తుంది.

జి. వాస్తవాన్ని సామస్త్యంగా పరిశీలన చేసే ప్రక్రియలో తత్త్వశాస్త్రి రకరకాల వాస్తవపు రూపాలను ఎదుర్కొంటారు. మనుష్యులు, జంతువులు పక్షులు, చెట్లు, భూమి, నీరు, ఆకాశం మొదలగునవన్నీ వాస్తవంలోని భాగాలే. అంతేగాక మానవ సమాజంలోని రకరకాల సంబంధాలు, పలురకాల ఉత్పత్తి కార్యక్రమాలు, పలురకాల జిజ్ఞాసలు ఇవన్నీ వాస్తవంలో భాగాలే. వాస్తవాన్ని విశ్లేషించడంలో, అర్థం చేసుకోవడంలో, వివరించడంలో, ప్రత్యామ్నాయ ప్రాపంచిక దృక్పథాన్ని రూపొందించడంలో, తత్త్వశాస్త్రి తత్త్వశాస్త్రాన్ని విభజించి అధ్యయనం చేస్తాడు. ఇట్లు మతతత్త్వశాస్త్రం, సౌందర్య తత్త్వశాస్త్రం, నైతిక తత్త్వశాస్త్రం, చరిత్ర తత్త్వశాస్త్రం, సాంస్కృతిక తత్త్వశాస్త్రం, సాంఘికశాస్త్ర తత్త్వశాస్త్రం, రాజకీయ తత్త్వశాస్త్రం, ఆర్థిక తత్త్వశాస్త్రం, భాషా తత్త్వశాస్త్రం, విజ్ఞాన శాస్త్ర తత్త్వశాస్త్రం, మొదలగునవి ఈ విభజనాత్మక పరిధిలోనికి వస్తాయి.

అంతేగాక, ఒకొక్క సమాజపు ఆర్థిక, రాజకీయ, భౌగోళిక పరిస్థితులను బట్టి తాత్త్విక భావాలు రూపొందుతుంటాయి. కాబట్టి, తత్త్వశాస్త్రం గూడ భౌగోళికంగా విభజించబడింది. ఈ విధంగా, పాశ్చాత్య తత్త్వశాస్త్రమని, ప్రాచ్యతత్త్వసాస్త్రమని, భారతీయ తత్త్వశాస్త్రం, చైనీల తత్త్వశాస్త్రం, అమెరికన్ తత్త్వశాస్త్రం, బ్రిటిషు తత్త్వశాస్త్రమనే విభజనలను చేశారు. దీనినే కాల విభజన ప్రకారం, ప్రాచీనతత్త్వశాస్త్రం, మధ్యయుగపు తత్త్వశాస్త్రం, ఆధునిక తత్త్వశాస్త్రం, సమకాలీన తత్త్వశాస్త్రాలుగా విభజించారు. ఇట్లు తత్త్వశాస్త్రం అంశాల వారిగాను, భౌగోళికంగాను, సమస్యల వారిగాను, వ్యక్తులవారిగాను, కాల విభజనలను బట్టి

విభజించబడింది. తత్త్వశాస్త్రాన్ని చదవడం వలన వ్యక్తి ఈ అంశా లన్నింటిని గురించిన సరియైన సమగ్రమైన విశాలమైన అవగాహనను పెంపొందించుకుంటాడు.

మొత్తంమీద తత్త్వశాస్త్రాల ధోరణులను మూడు వర్గాలుగా విభజించ వచ్చు. మారుతూవుండె తత్త్వశాస్త్రాలు, మార్పుకు అడ్డువచ్చే తత్త్వశాస్త్రాలు, మార్చె తత్త్వశాస్త్రాలు. దేశ ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులు మారేకొలది, తత్త్వశాస్త్రాలుకూడ మారుతుంటాయి. సమకాలీన పరిస్థితులకు జవాబుగాను, సమస్యలకు పరిష్కార మార్గాలుగా వుండాలనే లక్ష్యం గలిగిన తత్త్వశాస్త్రాలు మారుతూవుంటాయి. ఐతే, పరిస్థితులు మారినా, సమస్యల గుణంమారినా, ప్రపంచమంతా తలక్రిందులైనాసరే మారని తత్త్వశాస్త్రాలు కొన్ని వున్నాయి. అసలు మార్పేవద్దని, మార్పునే ప్రతిఘటిస్తాయి ఈలాంటి తత్త్వశాస్త్రాలు. ఈలాంటి తత్త్వశాస్త్రాలను ఎన్నో శతాబ్దాల క్రిందట, ఆనాటి తత్త్వశాస్త్రజ్ఞులు రూపొందించారు. అయినను, ఆ తత్త్వశాస్త్రాలు, అన్ని కాలాలలో, అన్ని దేశాలలో, అందరి మానవులలో జనించె అన్నిరకాల సమస్యలను పరిష్కరించ గలవని ఈ కోవకు చెందిన ప్రజల అభిప్రాయం. వీటినే మనిషిని వెనక్కి తీసికొనిపోయే తత్త్వ శాస్త్రాలంటారు. ఇవిగాక, ప్రపంచాన్ని మార్చే తత్త్వశాస్త్రాలు కొన్ని వున్నవి. మనిషిని, మనిషిలోని మానవత్వాన్ని, మానవ విలువలను దృష్టిలో పెట్టుకొని, పరిస్థితులను, మనుషులను, మార్చాలని ఈలాంటి తత్త్వ శాస్త్రాలు ప్రయత్నిస్తాయి.

ఆనందాన్ని ఆశించి రూపొందించిన తత్త్వశాస్త్రాలను స్పందన తత్త్వ శాస్త్రాలంటారు. (philosophies of feeling); జ్ఞానాన్ని జ్ఞానం కొరకే తెలుసుకోవాలనే వాటిని సైద్ధాంతిక తత్త్వశాస్త్రాలంటాను (theoretical philosophies); నిర్మాణాత్మక కార్యాలచే ప్రేరేపించబడిన వాటిని క్రియాత్మకతత్త్వశాస్త్రాలంటాము. (practical philosophies).

5

# తత్త్వశాస్త్ర విషయనిర్మాణం

తాత్త్విక పరిశోధనను మూడు భాగాలుగా వర్గీకరించవచ్చు :

1. అధిభౌతికశాస్త్రం
2. జ్ఞానసిద్ధాంతం-తర్కశాస్త్రం
3. నైతికశాస్త్రం

## 1. అధిభౌతికశాస్త్రం

ప్రప్రథమంగా అధిభౌతికశాస్త్రాన్ని అప్రాకృతిక వాస్తవాలను గురించిన జిజ్ఞాసగా వర్ణించారు. సంక్షిప్తంగా చెప్పాలంటె ఆది, అంతము, మనిషి, పదార్థము, దేవుడు, అమరత్వం, కాలం, స్థలం, అనే మొదలగు కేవల అంశాలను గురించిన లేక ప్రథమ సూత్రాల పరిశోధననే అధిభౌతిక తత్త్వశాస్త్రంగా వర్ణించారు. ఈ జిజ్ఞాసలో అతి ప్రాముఖ్యమైనది సత్తాసిద్ధాంతం.

### ఎ సత్తా సిద్ధాంతం (DOCTRINE OF BEING)

ప్రపంచానికి మూలకారణమేది? దేనివలన ప్రపంచం ఉనికిలోనికి వచ్చింది? ఏది లేకపోతే ప్రపంచంవుండక పోవడమనేది జరుగుతుంది? మరే ఇతరమైన కారణంవలనగాక దానికదే కారణంగాను, మరియు ఉనికి గలిగి వున్న ప్రపంచమంతటికి కారణం వున్నదేది? ఈలాంటి ప్రశ్నలన్ని దేనివైపు గురిపెట్టి వుంటాయో, దేనిని దృష్టిలో పెట్టుకొనివున్నాయో, దానినే సత్తా అని అంటారు. స్థూలంగా, ఈ సత్తాశాస్త్రం, భావ, భౌతిక, అజ్ఞేయ, అస్తిత్వ మొదలగు సిద్ధాంతాల దృష్ట్యా వివరించబడింది.

భావవాద తాత్త్విక పరిశీలన ప్రకారం వాస్తవం ఆవిర్భవించడానికి ఏదో ఒక ఆత్మ, ఒక శక్తి, ఒక సూత్రం, కారణమైవుంటాయి. దీనికి బ్రహ్మ, కేవల ఆత్మ, ప్రథమ కారణం, దేవుడు, కదిలించే కదలని శక్తి, ఇంద్రియాతీతశక్తి, పరమాత్మ అనే మొదలగు పేర్లు ఇచ్చారు. సృష్టి దీనిలో నుండి ఆవిర్భవించినదని కొందరు, దీనికి వేరుగా, ప్రత్యేకంగా సృష్టించబడిందని మరికొందరు, దాని పరిణామమే సృష్టియని మరికొందరు అంటారు. మొత్తానికి సృష్టిని దానికి కారణమైన దానికంటె తక్కువ విలువైనదిగా, తక్కువస్థాయిలో వుండేదిగా వర్ణించారు. సృష్టిలో ఏది జరిగినా, దానికి కారణమైన సత్తాకు మించి జరుగవని, ఆ ప్రథమ కారణ ధర్మాల పరిధిలోనే జరుగుతాయని అధిక సంఖ్యాకులైన తాత్త్వికులు భావించారు.

భౌతికవాద తత్త్వశాస్త్రం ప్రకారం, భౌతిక ప్రపంచం దానికదే కారణం. పంచభూతాల నుండి లేక చతుర్భూతాలనుండి ప్రకృతిలో వున్నదంతా రూపొందింది. కాబట్టి పదార్థమే కేవల సత్తా అని భౌతిక తత్త్వశాస్త్రజ్ఞులు వివరిస్తారు. ప్రపంచ పరిణామసిద్ధాంతం, గతితార్కిక భౌతికవాదం కొన్ని రకాల అద్వైత సిద్ధాంతాలు ఈ కోవకు చెందినవే.

అజ్ఞేయ తత్త్వశాస్త్రజ్ఞులైతే సృష్టి ఎట్లా వచ్చిందో, దానికి మూల కారణమేమిటో, దాని అంతమేమోననే విషయాలు మానవుడు పూర్తిగా తెలుసుకోలేడంటారు. భౌతిక ప్రపంచాన్ని గురించిన జ్ఞానం చాలవరకు మానవుని అనుభవానికి పరిమితమైయుంటుందని వీరి భావన. ఇక్కడ అనుభవమనేది సంవేదనలు, ముద్రణలు, ప్రత్యక్షత మొదలైన వాటికి ప్రతీకగా ఎంచబడింది. వీటికి అందుబాటులో లేని వాటిని, అతీతమైన వాటిని మనం తెలుసుకోలేమని అజ్ఞేయవాదులు ఉద్ఘాటిస్తారు. అస్తిత్వ శాస్త్రజ్ఞులకు ఆది అంతమనేది అంత తీవ్రంగా ఆలోచించవలసిన విషయాలు కావు—ఇప్పుడు, ఇక్కడ, ఈ జీవితం అనేవి వారికి చాల ముఖ్యమైన విషయాలు. పదార్థం, ఆత్మలకంటె, జీవితం వీరి అభిమాన తాత్త్వికాంశం.

పైగా ఈ సత్తాను కొందరు చలనంలేని ద్రవ్యంగాను, మరికొందరు నిరంతరం కదులుతుండే ప్రక్రియ గాను (process), కదలిక గాను, సాంస్కృతిక శక్తిగాను, భాషగాను వివరించారు. అంతేగాక, ఈ సత్తాను కొందరు వ్యక్తిగాను, శక్తిగాను, కొందరు ఒక సూత్రంగాను, మరికొందరు ఒక పరిణామ ప్రక్రియగాను, కొందరు కేవల విలువగాను వర్ణించారు. కొన్ని సందర్భాలలో ఈ సత్తా ఒక్కటేనని (అద్వైతం), రెండు అని (ద్వైతం) లెక్కకులేనన్ని సత్తాల కలయికయని, ప్రపంచమే సత్తాయని వివరించారు. ఈ సత్తాకు నామరూపాలులేవని కొందరు, నామరూపాలుంటాయని కొందరు, కేవలం కొన్ని లక్షణాలు మాత్రమే వుంటాయని మరికొందరు ప్రతిపాదించారు.

సత్తాను తెలుసుకోగలమని, విశ్లేషించవచ్చని కొందరంటె, అసలు పూర్తిగా తెలుసుకోలేమని మరికొందరు, కొంతవరకు మాత్రమే తెలుసుకోగలమని మరికొందరు తాత్త్వికులు వెల్లడించారు. సత్తాతో ఏకమైపోవచ్చునని మరొక తాత్త్విక వర్గం ఉద్ఘాటిస్తుంది. వ్యక్తి తన శక్తితో, ప్రపంచంతో అనగా పదార్థం మరియు సహమానవులతో కలిగియుండె కార్యాచరణే సత్తాయని మరికొందరంటారు. సత్తా ఇంద్రియాతీతమని కొందరు ఇంద్రియాత్మకం, అనుభవాత్మకం అని కొందరు, క్రియాత్మకమని మరికొందరు, పాదార్థికమని మరికొందరు వివరించారు. సత్తా అనేది సత్యం, మంచితనం సౌందర్యాల మేళవింపని కొందరంటారు. అధి భౌతికశాస్త్ర పరిధిలోనే నిర్ణయ, అనిర్ణయ, స్వేచ్ఛ, నిర్ణయత, భవిష్యత్తు, మరణాంతర జీవితం మొదలగు సిద్ధాంతాలు చర్చించబడతాయి. ఈ విభిన్నమైన సత్తా సిద్ధాంతాలను ప్రతిపాదించినదెవరు, ఈ ప్రతిపాదనలకు వెనకనున్న సందర్భాలేవి, ఈ సిద్ధాంతాల సారాంశమేమి అని తెలుసుకోవాలంటె తత్త్వశాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయవలసిన అగత్యత ఎంతైనావుంది.

## బి. సృష్టి-ఆద్యంతాలు (CREATION-ORIGIN AND END)

సృష్టి మూలం, స్వభావం, అస్తిత్వం, మానవ జీవితంలో దాని స్థానం, మొదలగు విషయాలను తత్త్వశాస్త్రం చర్చిస్తుంది. ఈ చర్చల్లో, విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితాలు తార్కిక పరిశీలనా ఫలితాలు, సృష్టిని గురించిన కట్టుకథలు, పురాణగాథలు మొదలగు విషయాలుగూడ పరిగణనలోకి తీసుకోబడతాయి. తత్త్వశాస్త్రజ్ఞుడు వీటన్నింటిపై తాత్త్వికంగా ప్రతిబింబిస్తాడు.

## సి. మనిషి-సమాజం (MAN AND SOCIETY)

మానవుడనగానేమి? ఈ ప్రశ్నకు తత్త్వశాస్త్రజ్ఞులు రకరకాల జవాబులిచ్చారు. మానవుడు ప్రకృతిలో ఒక భాగం; దైవ స్వరూపి, ప్రకృతికి వేరుగా కొన్ని విశిష్టమైన లక్షణాలను కలిగినజీవి; జీవాత్మ, ఉన్నతస్థాయికి పరిణామం చెందినవాడు; సంకల్పం, వివేచన స్వేచ్ఛలను కలిగిన వాడు అనే మొదలగు వివరణలను తత్త్వశాస్త్రజ్ఞులు మానవుని గురించి రూపొందించారు. కొన్నిసార్లు మానవుణ్ణి నవ్వే జంతువుగాను మాట్లాడే జంతువుగాను, వంటచేయగల జంతువుగాను, సాంఘిక జంతువుగాను ప్రకృతికి వేరుగా కొన్ని విశిష్టమైన లక్షణాలను కలిగినవారుగా మనిషిని వర్ణించారు. మనిషియొక్క అత్యంత విలువ ఏది? వ్యక్తిగతంగాను, సామాజికంగాను మానవుడు కోరదగిన జీవితమేది? అర్థవంతమైన జీవితమేది? ఒక వ్యక్తిగత మానవుడు సహమానవులతో వ్యవహరించవలసిన తీరు ఏది అనే మొదలగు విషయాలు ఈ అంశం క్రింద వివరించబడ్డాయి. ఈ విషయాలపట్ల మానవునిలో వున్న అవగాహనకు, మానవునిలోని మానవతాధోరణికి, తత్త్వశాస్త్రం పదును పెడుతుంది. ఇక్కడ సార్వత్రిక సామాజిక, మానవతా, వివేచనాత్మక దృష్టిలో సమాజంలో జీవించడానికి

అనువైన తాత్త్విక వాతావరణాన్ని సృష్టించడానికి తత్త్వశాస్త్రం తోడ్పడుతుంది.

సమాజమంటె వ్యవస్థీకరించబడిన వివేచనాత్మకమైన (rational) మానవులని, ప్రాకృతిక ధర్మం ప్రకారం నడిచే మనుషుల కలయికయని, అర్థవంతమైన జీవితానికి కృషిచేసే వ్యక్తులని, ముందుగానే నిర్ణయించబడిన కొన్ని ధర్మాలకు బద్ధులై జీవించేవారని నిర్వచించడం జరిగింది. అసంపూర్ణస్థాయినుండి సంపూర్ణస్థాయికి (perfect) రూపొందడానికి, జీవాత్మ స్థాయినుండి పరమాత్మలో లీనమైపోయే స్థాయికి ఎదగడానికి, జంతుస్థాయినుండి వివేచనాత్మక స్థాయికి ఎదగడానికి స్వభావాన్ని బట్టి స్వధర్మను నెరవేర్చడానికి, అన్యాయపు వ్యవస్థనుండి న్యాయమైన వ్యవస్థకు, దోపిడిచేసే సమాజంనుండి మానవీకరణమైన సమాజానికి చేరడానికి చేసేకృషిలో మనిషికి సమాజానికి మధ్య కార్యాచరణ జరుగుతూవుంటుంది. ప్రతి వ్యక్తిలోను, సమాజంలోను ఏదో ఒక నిష్పత్తిలో వివేకం, భావోద్రేకం, ఆవేశం మొదలైనవి పనిచేస్తూనే వుంటాయి. వీటిలో వివేచన స్థాయిలో జీవితాన్ని రూపు దిద్దుకోవాలనేది తత్త్వశాస్త్రజ్ఞుల ఆశాభావం.

## డి. రోదసి-కాలం (SPACE AND TIME)

రోదసి, కాలాలు గుణాత్మకమైనవా, పరిమాణాత్మకమైనవా? మానవ ఆలోచనకు వేరుగా వీటికి స్వతంత్ర ప్రతిపత్తి వున్నదా? లేక అవి మన అనుభవ పరిధిలో వుండే మానశిక ధోరణులా అనేది మనం చర్చించవలసిన కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు. సాధారణంగా రోదసి అనే దానిని ఒక శూన్యమని, అందులో శరీరాలు ఉనికి కలిగివుంటాయని అనుకుంటాము. అంతేగాక అది అనంతమైనదని, అన్ని దిక్కుల వ్యాపించి వుందని భావిస్తాము కూడ. పైగా, కుడి, ఎడమ, పైన క్రింద, దగ్గర, దూరమనే అనుభవానికి వేరుగా మరొక సంబంధంకూడ మన అనుభవంలో

ఉనికి కలిగియుంటుంది. ముందు, తరువాత (అప్పుడు, ఇప్పుడు) అనే ఒక పరంపరానుభవాన్ని గూడ మనం కలిగి యుంటాము. దీనిని కాలమంటాము. రోదసి వలె కాలానికి మూడు పరిమాణాలు కాక ఒక్క పరిమాణమే (dimension) వుంటుంది. కాలమనేది ఒక నదిలాగా ప్రవహిస్తుందని, ఈ నదిలో ప్రస్తుతం, గతం, భవిష్యత్తు అనే మూడు భాగాలుంటాయని గుర్తించడం జరిగింది. మరియు వర్తమాన కాలమనేది ఇప్పటి అనుభవంలోని వాస్తవం; భూత (గతించిపోయిన) కాలం మన జ్ఞాపకంలో నిర్మించబడుతుంది. భవిష్యత్తు కాలం మన ఊహలలో ముందుగానే ఆశించబడుతుందని వివరించబడిందికూడ. అంతేగాక రోదసి-కాలాలు మన అనుభవంలో నుండి వచ్చినవి కావు; మన అనుభవానికి ముందే వుండె మన గ్రహణ రూపాలని కొందరంటారు. ఇది గాక రోదసి కాలాలను గురించి భౌతిక, భావాత్మక, గణిత వివరణలను తత్వశాస్త్రజ్ఞులిచ్చారు, ఈ వివరణలను గురించిన జ్ఞానాన్ని సంపాదించాలంటే తత్వశాస్త్రాన్ని చదివి తీరాల్సిందె.

## ఇ. మనస్సు (MIND)

మనసంటె ఏమిటి? ఇది పాదార్థికమా లేక ఒక అమూర్త వాస్తవమా? సాధారణంగా మనస్సు అనే పదాన్ని 'ఆత్మ'గా అర్థం చేసుకుంటారు. గ్రీకు భాషలోని "సైఖె" అనే పదాన్ని మూలంగా తీసుకుంటె, ఆత్మ అనే అర్థం సరియైనదిగా కనిపిస్తుంది. ప్రాచీన మానవుడు మనసును శరీరంయొక్క ఛాయగా లేక నీడగా అర్థంచేసుకున్నాడు. మరికొందరి తత్వశాస్త్రజ్ఞుల దృష్టిలో మనసనేది ఒక సారాంశమని (essence), అది శరీరంలో బంధింపబడిందని భావించారు. మనస్సు శరీరంయొక్క రూపమని మరికొందరంటారు. మనస్సుగూడ పదార్థమేనని కొందరు ఉద్ఘాటించారు. మనస్సును గురించి ప్రాక్ పశ్చిమ తత్వశాస్త్రాలలో పలు రకాల వివరణలు ప్రతిపాదించబడినాయి. ప్రవర్తనాత్మక (behaviourism)

సిద్ధాంతం నవ్యవాస్తవ సిద్ధాంతం (Neo-realism), అర్ధక్రియవాద (pragmatism) సిద్ధాంతం, మరియు గెస్టాల్టు, ఫ్రాయిడ్ మొదలైనవారు మనస్సును గురించి విభిన్న వివరణలు ప్రతిపాదించారు. వీటిని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలంటె తత్త్వశాస్త్రాన్ని అధ్యయనం చేసి తీరాలి.

మనస్సు యొక్క స్వభావం ఆలోచించడమని, శరీరం యొక్క స్వభావం వ్యాపించడమని కొందరు నిర్వచించారు. ఈ రెండు కలిసే వుంటాయని కొందరు, విడివిడిగా వుంటాయని మరికొందరంటారు. ఈ రెండూ వేర్వేరుగా వున్నప్పటికి, సమాంతరంగా పనిచేస్తుంటాయని, రెండింటికి మధ్య అంతర్గత కార్యాచరణ వుంటుందని కొందరు తాత్త్వికులు విశదీకరించారు. ఈ రెండింటిని శక్తులుగా అభివర్ణించారు. ఐతే, ప్రపంచంలోని వివిధ జీవులలో ఈ శక్తియొక్క నిష్పత్తి, పరిమాణము భేదిస్తుంది: ఉ॥ జంతువులు, మనుష్యులు, పక్షులు మొదలగునవి. అంతేగాక వాస్తవమంతా మానశికమేనని కొందరు తత్త్వశాస్త్రజ్ఞులు సిద్ధాంతీకరించారు.

## ఎఫ్. పదార్థము : (MATTER)

పదార్థాన్ని వివరించె ప్రక్రియలోకూడ విభిన్న భావాలు వెలుగులోకి వచ్చాయి. ప్రాచీనయాంత్రిక పాదార్థిక ప్రాపంచిక దృక్పథాల ప్రకారం, ప్రకృతి అంతా పదార్థం నుండే వచ్చింది. పదార్థమనేది ఒక అమూర్త పదం. ఇది భౌతిక వస్తువులన్నింటికి వాడదగిన పదం. పదార్థమంటె భౌతిక వస్తువుల శాశ్వతాన్ని సూచిస్తుంది. దీనిని వాస్తవానికి ప్రతీకగా అర్థంచేసుకోవాలి. పదార్థమనే పదం మట్టి, మనిషి, ఆకాశం, నీరు, వెలుగు, మొదలగు ప్రకృతిలోని అన్ని వస్తువులకు జీవులకు వర్తిస్తుంది. పదార్థసిద్ధాంతం అణువు, వెలుగు, పరిమాణ సిద్ధాంతం, అనిశ్చయ సూత్రం, మొదలగు వాటిని గురించి చర్చిస్తుంది.

## జి. స్వేచ్ఛ-నిర్ణయత (FREEDOM AND DETERMINISM)

స్వేచ్ఛ అనగా బలవంతంలేనిస్థితియని అర్థం. బయట నుండి ఏ శక్తివలననైనా ఒత్తిడి చేయబడని పరిస్థితిని స్వేచ్ఛ అంటారు. వ్యక్తి యొక్క కార్యాలు, తీర్మానాలు వాటికి పూర్వముండె కొన్ని కారణాలవలన నిర్ణయించబడితే దానిని నిర్ణయించబడటమంటారు. మనిషికి సంపూర్ణ స్వేచ్ఛంటూ వుంటుందా? మనిషియొక్క తీర్మానాలు, కార్యాలు, ముందుగానే నిర్ణయించబడితే మనిషి యొక్క బాధ్యతకు స్థానమెక్కడుంటుంది? కారణంలేకుండా మానవ క్రియలుండవని కొందరు, అన్నింటికి కారణముంటె మానవ స్వేచ్ఛకు స్థానమెక్కడుంది అనే వాగ్వివాదాలు ఇందులో ఇమిడియున్నవి. వారసత్వం వ్యక్తిగత గుణగణాలను నిర్ణయిస్తుందని కొందరు, ఆర్థిక పరిస్థితులే మనిషియొక్క జీవితశైలిని నిర్ణయించె అంతిమ నిర్ణయశక్తియని మరికొందరంటారు. వీటన్నింటిని గురించి విశదీకరించడం తత్వశాస్త్రపు అంశాలలో ఒకటి.

## 2. జ్ఞాన సిద్ధాంతం (THEORY OF KNOWLEDGE)

భౌతిక ప్రపంచాన్ని గురించిగాని, లేక అధిభౌతిక అంశాలను గురించిగాని తెలుసుకనే ప్రయత్నంలో జ్ఞానసిద్ధాంతం రూపొందిందది. తెలుసుకునే మార్గాలేవి, సాధనాలేవి, తెలుసుకునే ప్రక్రియకుండె పరిమితులేవి అనే విషయాలను ఇక్కడ చర్చిస్తారు. మనమందరం, వస్తువులు, విషయాలు, మనుష్యులను గురించిన సత్యాన్ని తెలుసుకోవాలని ఆశిస్తాము. కాని తెలుసుకోవడమంటె ఏమిటి? తెలుసుకునే మార్గాలేవి? అసలు సత్యమంటె ఏమిటి? జ్ఞానానికుండె పరిమితులేవి? ఈలాంటి విషయాలను జ్ఞానసిద్ధాంతం చర్చిస్తుంది. సాధారణంగా సత్యాన్వేషణలో జరిగే విషయమేమంటే, మనదృష్టిలో దేనినైతే సత్యమైనదని అనుకుంటామో దానిని వాస్తవంగా ఎంచుతాము. ఐతే, "మనదృష్టిలో సత్యమైనవి" అంటె

ఏమిటి? "మనదృష్టి అనగానేమి? దాని పరిమితులేవి? దానిశక్తి ఎంత అనే విషయాలు మనం చర్చించకపోవచ్చు. చర్చించకుండానే సత్యమని ఉద్ఘాటించవచ్చు. ఏ సాక్ష్యంమీద ఆధారపడి వ్యక్తి ఇది నిజము లేక అది అబద్ధమంటాడో ఆ సాక్ష్యాన్ని పరిశీలించే కార్యం జ్ఞానసిద్ధాంత పరిధిలోకి వస్తుంది. ఈ అధ్యయనం విషయ నిరూపణకు ప్రయత్నిస్తుంది. జ్ఞాన సిద్ధాంతం అర్థాన్ని విశ్లేషిస్తుంది; ఆధారాలను బయటపెడుతుంది. కాబట్టి ఆలోచించడం, తెలుసుకోవడమనే తాత్త్విక ప్రక్రియలో అతిప్రాముఖ్యమైన ఈ జ్ఞాన సిద్ధాంతాన్ని గురించి కొంత అవగాహన కలిగియుండడం చాల అవసరం.

జ్ఞానం గుణాత్మకం. జ్ఞానాన్ని ఒక వస్తువును తెచ్చినట్లు తీసుకొని రాలేము. డబ్బును సంపాదించినట్లు సంపాదించలేము కూడ. జ్ఞానం ఒక వస్తువు కాదు. అది అనుభవంలో జనించె ఒక ప్రక్రియ; ఒక శక్తి; ఒక అవగాహన; బయలుపర్చబడిన ఒక రహస్యం. జ్ఞానం వలన వ్యక్తి పరిస్థితులను, సంఘటనలను, భవిష్యత్తును పసిగట్టగలడు. మనిషిని స్వేచ్ఛాజీవిగా చేయగలిగిన శక్తి జ్ఞానానికి చాలవుంది. ఈ జ్ఞానం ఎట్లు ఏర్పడుతుందో ఎట్లు జనిస్తుందో అనేది ఒక జటిల సమస్యగా మనలనెదుర్కొంటుంది. కాబట్టి జ్ఞానం ఏయే సాధనాలద్వారా సాధ్యమవుతుందో ఆ సాధనాలను తత్త్వశాస్త్రం విశ్లేషిస్తుంది. తత్త్వశాస్త్రాలు గుర్తించిన సాధనాలలో కొన్నింటిని సంక్షిప్తంగా వివరిద్దాం.

ఎ. **హేతువు :** హేతువు ద్వారానే సత్యాన్ని తెలుసుకోగలమనే వారందరిని హేతువాదులంటారు. హేతువు, విషయాన్ని నిష్పక్షపాతంగా, సజావుగా పరిశీలన చేస్తుంది. హేతువులో గుడ్డి నమ్మకాలకుగాని, అతీంద్రియ, అతిప్రాకృతిక విషయాలను గురించిన కల్పనలకుగాని, ఆత్మాశ్రయ భావాలకుగాని తావుండదు. అన్నిరకాలైన జ్ఞానాల యదార్థతకు పరీక్షించగల సమర్థత హేతువుకుందని హేతువాదుల భావన.

వీరిలో కొందరు హేతువును సార్వత్రిక సూత్రంగాను, కేవల ఆత్మగాను వర్ణిస్తారు. మరికొందరు, హేతువును మానవులమనస్సులోవుండె ఒక భాగంగా అభివర్ణిస్తారు. హేతువాదుల్లో కొందరు భావవాదులున్నారు; మరికొందరు భౌతికవాదులున్నారు. భావవాద హేతువాదుల దృష్టిలో హేతువు కేవలమైనది; విశ్వపరిణామానికి, చరిత్రకు, ప్రపంచంలో జరిగే ప్రతి సంఘటనకు ఈ సార్వత్రిక హేతువే మూలం. ఈ హేతువు మానవ ఆలోచన ద్వారా పనిచేస్తుంది. కాబట్టి జరిగే చరిత్రంతటి వెనక కేవల ఆలోచన (హేతువు) వుంటుందని వీరి అభిప్రాయం. ఈ కారణంచేత వీరిని కేవల, బాహ్యాత్మక భావవాదులంటారు. హెగెల్ ఈ ధోరణికి ప్రముఖుడు. డేకాట్, స్పినోజా, లైబ్నిజ్ ఈ కోవకు చెందినవారే. హేతువాదుల్లోను మరొక వర్గాన్ని భౌతికవాద హేతువాదులుగా చిత్రించవచ్చు. వీరి దృష్టిలో హేతువు, వ్యక్తివాదే ఒకమానసిక సాధనం. ఇక్కడ హేతువు శాస్త్రీయతకు, తార్కికత్వానికి ప్రతీక. దీనిప్రకారం ఏ విషయమైనాసరే అది వాస్తవమైనదిగాను సత్యమైనదిగాను అంగీకరించబడాలంటే దానిని హేతువాదంతో శాస్త్రీయ పద్ధతిలో పరిశీలన చేయాలి.

పాశ్చాత్య తాత్త్వికులలో ప్లేటో, అరిస్టాటిల్ హేతువాదాన్ని ఒక తార్కిక సాధనంగా ఎంచారు. మరొకరి సాక్షంతో ఆధారం లేకుండానే, ఒక విషయం స్వసాక్షిగా నిలబడగలిగినప్పుడు దానిని హేతువాదానికి నిలబడగలిగిన సత్యంగా ఒప్పుకుంటారన్నమాట. కాబట్టి హేతువు అనేది శాస్త్రీయతకు, తార్కికత్వానికి, వాస్తవానికి ప్రతీకగా పనిచేసే జ్ఞానసాధనమని తెలుస్తుంది. అందువల్లనే ఊహాగానాలకంటె, ఇంద్రియాత్మక ఆధారాలకంటె హేతువు ద్వారా ఆర్జించే జ్ఞానానికి ఎక్కువ విలువ నిస్తారు.

బి. **అనుభవం :** అది ఏలాంటి జ్ఞానమైనా అనుభవానికి అతీతంగా వుండకూడదచే వారిని అనుభవాత్మక వాదులంటారు. ఐతే, అనుభవమనేది ఎన్నెన్నో రకాల అనుభూతులను కలిగివుంటుంది. కాబట్టి కొందరు తత్త్వ

శాస్త్రజ్ఞులు ఈ అనుభవాన్ని సంవేదనలకు, మరికొందరు ప్రత్యక్షతకు, మరికొందరు ముద్రణలకు పరిమితం చేశారు. వీరిదృష్టిలో జ్ఞానం సంవేదనల ద్వారా, మనస్సులో ఏర్పడే ముద్రణలద్వారా ప్రత్యక్షత ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. బ్రిటిష్ దేశ తత్వశాస్త్రజ్ఞులు చాలవరకు ఈ కోవకు చెందియున్నారు.

1. సంవేదనలు (ఇంద్రియజ్ఞానం) : చూపు, వాసన, స్పర్శ, మొదలగు వాటి ద్వారా జనించె జ్ఞానాన్ని ఇంద్రియజ్ఞానమంటారు హేతువాద తత్వశాస్త్రజ్ఞులు ఇంద్రియ జ్ఞానాన్ని దోషపూరితమైనదని, స్థానికమైనదని, ప్రత్యేకమైనదని సార్వత్రీకరించలేనిదని నిరాకరించారు. చీకటిలో ప్రయాణించె వ్యక్తి త్రాడును చూచి పాము అనుకొని భయపడడంలో ఇంద్రియ జ్ఞానంలోని లోటు వ్యక్తమవుతుంది. అలాగే ఇంద్రియ జ్ఞానం ఒక్క స్థలానికి, ఒక్క సమయానికి, ఒక్క సందర్భానికి మాత్రమే పరిమితమై యుంటుందని హేతువాదుల వాదన. ఐతే ఏ హేతువైనా ఇంద్రియ జ్ఞాన పరిమితిలో నుండి ప్రపంచాన్ని దాటిపోలేదని, ఇంద్రియ జ్ఞాన పరిమితమైన సంవేదనలే హేతువుకు గూడ మూలాధారాలని ఇంద్రియ జ్ఞానవాదులు సమర్థిస్తారు. జాన్‌లాక్ ప్రకారం మానవుని మనసు ఒక ఖాళీ గదిలాంటిది. మనిషికి బాహ్య ప్రపంచంతో ఏర్పడే సంబంధం సంవేదనల ద్వారా కలుగుతుందని అతడు వివరించాడు. 2. ముద్రణలు : డేవిడ్ హ్యూమ్ అనే మరొక బ్రిటిష్ తత్వవేత్త మన ముద్రణలకి అతీతంగా వుండే దేనినైనాసరే తెలుసుకోవడం అసాధ్యమన్నాడు. బాహ్య ప్రపంచంలో మనం చూచే విషయాలు, సంఘటనల పరంపరలు మన మనసుల్లో భావానుబంధాలను పెంపొందింపజేస్తాయి. వాస్తవంగా బాహ్య ప్రపంచంలో జరిగే సంఘటనల మధ్య ఏలాంటి కారణ సంబంధాలు లేవు. వాటిని మనం అర్థం చేసుకోలేమని హ్యూమ్ ఉద్ఘాటించాడు. కొందరి దృష్టిలో భావాలు మనుష్యుల్లో అంతర్గతంగా వుంటాయంటారు. అనగా ప్రతివ్యక్తిలో అన్ని భావాలుంటాయని కాదు. కొన్ని సార్వత్రిక భావాలు అందరి మానవుల్లో వుంటాయి. ఈ భావాలు

కలిగియుండటానికి విద్య, సంస్కృతి, నాగరికత మొదలైనవి అక్కరలేదు. ఉ॥ దేవుడు అనే భావం అందరి మానవుల్లో వుండవచ్చు. ఐతే ఆ భావం ఒకే రీతిగా వుండకపోవచ్చు. అడవుల్లో నాగరిక ప్రపంచానికి దూరంగా జీవించె వారిలో గూడ ఈలాంటి సార్వత్రిక భావాలుంటాయి. వాటిని బయటికి తీసుకొనిరావడంలో తత్త్వశాస్త్రజ్ఞుల పాత్ర ఇమిడి వుంది. సోక్రటీస్, రెనె దేకాట్ ఈ ధోరణిని సమర్థించారు. జ్ఞానం అనుభవం ద్వారానే సాధ్యమవుతుందని చెప్పేవారినందరిని అనుభవాత్మక జ్ఞాన సిద్ధాంతికులంటారు.

3. ప్రత్యక్షత : ప్రత్యక్షత సంవేదనలద్వారా వచ్చె జ్ఞానం చాల పాక్షికమైనది. అందులో కొంత అజ్ఞానం, కొంతభ్రమ చోటుచేసుకొని వుంటాయి. ప్రత్యక్షత ద్వారా జనించె జ్ఞానం ఇంద్రియ జ్ఞానం కంటె కొంత మెరుగని చెప్పవచ్చు. భారతీయ తత్త్వశాస్త్రంలో న్యాయ దార్శనికులు ప్రత్యక్షతను గురించి సుదీర్ఘంగా, విమర్శనాత్మకంగా వివరించారు. పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞుల్లో బ్రిటిష్ అనుభవికవాదియైన బెర్క్లీ జ్ఞానం ప్రత్యక్షతలోనే ఇమిడివుందని ఉద్ఘాటించాడు.

4. అనుమాన : ఒక జ్ఞానాన్నుండి మరొక జ్ఞానాన్ని సంపాదించడాన్ని అనుమాన అంటారు. ఇక్కడ ఒక సంజ్ఞను చూచి ఆ సంజ్ఞసూచించే వస్తువును తెలుసుకుంటాము. ఉ॥ పొగను చూచి నిప్పు ఉన్నదని తెలుసుకోవడం. కొన్నిసార్లు అనమాన ప్రత్యక్షతకు పూర్వముండె జ్ఞానంగా వర్ణించబడింది. కాబట్టి అనమానను పరోక్ష జ్ఞానమంటారు. 5. ఉపమాన: ఒక వస్తువుకు మరొక వస్తువుతో వుండె పోలికనబట్టి దానిని గురించి తెలుసుకోవడాన్ని ఉపమాన అంటారు. ఉపమానాన్ని పోలికవలన వచ్చె జ్ఞాన సాధనమనవచ్చు. దీనివలన వచ్చె జ్ఞానాన్ని ఉపమిత అంటారు. 6. శబ్ద : శబ్దను ఒక జ్ఞాన సాధనంగా న్యాయదర్శనం గుర్తించింది. నమ్మదగిన ఒక వ్యక్తి చేసే వాఙ్మూలాన్ని శబ్ద అంటారు. జ్ఞానమంతా ప్రత్యక్షతవలన, అనుమానవలన ఆర్జించబడదు. లౌకిక సాక్ష్యం దోషపూరితమైనది కాదు. అయితే పవిత్ర గ్రంథాలు లేక వేదాలనబడేవి దేవునిచే సృష్టించబడినవి గనుక,

పవిత్ర గ్రంథాలలోని సాక్ష్యం దోషరహితమైనవని ఎంచబడింది. సాక్ష్యమనేది వ్యక్తులనుండే వస్తుందని న్యాయదర్శకులందరు ఏకగ్రీవంగా ఒప్పుకుంటారు. జ్ఞానంయొక్క మూలము, జ్ఞాన సాధనా మార్గాలు, జ్ఞానాభివృద్ధి, జ్ఞానం యొక్క ప్రామాణికత మొదలగు విషయాలు విస్తృతంగా జ్ఞానసిద్ధాంతంలో చర్చించబడతాయి.

సి. దృగ్విషయ పద్ధతి : జ్ఞానమనేది భౌతికమూ కాదు; మానసికమూ కాదు; ఇది చైతన్యానికి (consciousness) సంబంధించినదని ఎడ్మండ్ హుస్సరల్ ప్రతిపాదించాడు. ఏ ప్రపంచం లేక ఏ విషయాలు మానవ చైతన్యానికి గోచరమవుతాయో ఆ గోచరమైన అనుభవమే జ్ఞానానికి మూలమని హుస్సరల్ భావించాడు. సాధారణంగా ఒక వ్యక్తి ఆలోచించె ఆలోచనలు గాని, నిర్ణయాలు గాని, అభిప్రాయాలు గాని, ఆనాటి ప్రపంచంలో చలామణి అయ్యే భావాలచే ప్రభావితమయి యుంటాయి. అందువలన ఆ గ్రహింపు తన స్వంతది అనడానికి వీల్లేదు; అది ఆనాటి ప్రపంచానిది. కాబట్టి వ్యక్తి వాస్తవాన్ని గురించిన యదార్థమైన జ్ఞానాన్ని పొందాలంటె ఆనాటి (భావ) పపంచాన్ని ప్రక్కన బెట్టాలి అనగా జ్ఞానమనేది ఏ ప్రాప్తి స్థానం నుండి ప్రారంభమవుతుందో వ్యక్తి అక్కడికి వెళ్లవలసిన అవసరతవుంది. ఆ ప్రాప్తి స్థానం చైతన్యమే చైతన్య రహితమైన జ్ఞానమంటూ ఎక్కడా వుండదు. మనిషికి చైతన్యమే లేకపోతే జ్ఞానాన్నార్జించే ప్రసక్తి ఎక్కడుంటుంది? కాబట్టి జ్ఞానార్జనకై, ప్రతిబింబించె స్థాయికి పూర్వముండె చైతన్యం దగ్గరకు వెళ్లాలి. అది జ్ఞానానికి పునాది. ఆ చైతన్యాన్ని ప్రపంచం ఎదుర్కొన్నపుడు (కనిపించినపుడు) ఏమి జరుగుతుందో, ఆ జరిగిన అనుభవాన్ని విశదీకరించి రూపొందించిన తరువాత, ఆ అనుభవం దృష్టిలో వాస్తవ ప్రపంచాన్ని అర్థం చేసుకోవడంలో యదార్థమైన జ్ఞానమిమిడివుందంటాడు హుస్సర్ల్. జ్ఞానాన్ని సంపాదించె ఈ పద్ధతిని దృగ్విషయ పద్ధతంటారు. వాస్తవాల సారాంశాల యొద్దకు వెళ్లి విషయాన్ని వర్ణించడమే ఈ పద్ధతి యొక్క ప్రత్యేకత. ఈ పద్ధతి విషయాల విభేదాలను కాదు గాని, విషయాల్లోని సామాన్య,సార్వత్రిక సారాంశాలను మూలంగా తీసుకుంటుంది.

**డి. గతితార్కిక పద్ధతి :** వాస్తవంలోని గూఢమైయున్న అంతర్గత వైరుధ్యాల దృష్ట్యా వాస్తవాన్ని అర్థంచేసుకొనే పద్ధతిని గతితార్కిక జ్ఞాన సిద్ధాంతమంటారు. ఈ పద్ధతి ప్రకారం మనిషికి వేరుగా కొన్ని ధర్మాలు పనిచేస్తుంటాయి. ఇవి గతితార్కిక ధర్మాలు. ఈ ధర్మాలను అర్థం చేసుకోవడం ద్వారా వ్యక్తి స్వేచ్ఛా జీవితానికి పునాదులు వేసుకోగలడు. వాస్తవం యొక్క అంతర్గత సంబంధం, వాస్తవంలోని వైరుధ్యాలు, వైరుధ్యాల మధ్య జరిగే సంఘర్షణలు, ఈ సంఘర్షణల ఫలితంగా కలిగే తక్షణ మార్పులు, మొదలైనవి గతితార్కిక ధర్మాలలో అతి ముఖ్యమైనవి. ఈ ధర్మాలు ప్రకృతిలోనూ, మానవ చరిత్రలోనూ పనిచేస్తూనే వుంటాయి. చరిత్ర గతి వీటి వలన నిర్ణయించ బడుతుంటుంది. కాబట్టి వీటిని అర్థం చేసుకోగలిగినవాడు ఒక వైపు స్వేచ్ఛను, మరొకవైపు చరిత్రను పసిగట్టగల శక్తిని సంపాదించగలడు.

ఐతే ఈ సత్యాలను మనిషి ఎట్లు తెలుసుకోగలడు? అనగా ఈ జ్ఞానం మనిషికి ఎట్లు సాధ్యమౌతుంది? మనిషి ఏ క్షణంలో ఏ స్థలంలో జన్మిస్తాడో, ఆ స్థలంలోనే ఎవ్వరితోనూ సంబంధంలేకుండా వుండినట్లయితే ఆ వ్యక్తి ఒక జంతువుగానో లేక ఒక చెట్టుగానో పెరుగుతాడు. అయితే, ఆ మనిషి ఇతర మనుషులతో సంబంధబాంధవ్యాలు కలిగివున్నప్పుడు, చుట్టూవుండే పరిసరాలతో సంబంధాన్ని పెంపొందించుకొన్నప్పుడు తనలో జ్ఞానం జనిస్తుంది. అనగా భాష, భావాలు, జ్ఞానం, ఆవిర్భవిస్తాయి. కాబట్టి జ్ఞానమనేది పరిమాణాత్మక వస్తువు కాదు. పుస్తకాలలో దాగివుండదు; ఎవరో ఇస్తే తీసుకోనేది అంతకంటె కాదు. మనిషికి ప్రకృతికి, మనిషికి మనిషికి మధ్య జరిగే కార్యాచరణలలో నుండి జ్ఞానం రూపొందుతుంది. ఈ ప్రక్రియలోనే మానవుడు గతితార్కిక ధర్మాలను తెలుసుకుంటాడు. ఆ ధర్మాలను తెలుసుకోవడం వలన ప్రకృతిని అదుపులో పెట్టగలడు. కొంత వరకు భవిష్యత్తును పసిగట్టగలడు గూడ. ఈ ధర్మాలేవి? ఈ ధర్మాల వలన చరిత్ర గతి నిర్ణయించబడె తీరు ఏమి? మానవ జీవిత మార్పులో

అభివృద్ధిలో ఈ ధర్మాలపాత్ర, మానవుని స్థానము మొదలైన విషయాలను ఈ పద్ధతిని క్షుణ్ణంగా అధ్యయనం చేయడం వలన తెలుసుకోగలము.

అంతేగాక తెలుసుకున్నాము అని మనమనుకునే జ్ఞానం సత్యమైన దని మనకు రూఢి ఏది? ఈ ప్రశ్నతో సత్యాన్ని గురించిన సిద్ధాంతాన్ని చర్చించె అవసరత వస్తుంది. సత్యాన్ని గురించిన ఏ ఆలోచనయైనా వాస్తవంతో ఏకీభవిస్తే దానిని సత్యమంటారు. అట్లుగాక, నమ్మకానికి వాస్తవానికి మధ్యవుండె అనుగుణ్యతే సత్య నిర్ధారణకు కీలకమని కొంద రంటారు. కార్యసాధనకు ఏది ఉపకరిస్తుందో అదే సత్యమని స్పష్టీకరిస్తారు. ఈ సిద్ధాంతాలను రూపొందించిన వారిని గురించి, ఈ సిద్ధాంతాల ముఖ్య వాదనలను గురించి, వాటి తారతమ్య దృష్టిలో తత్త్వశాస్త్రం సుదీర్ఘంగా చర్చిస్తుంది.

**3. నైతికసిద్ధాంతం :** తత్త్వశాస్త్రమంతా అధ్యయనంచేసి ఏంచేయాలి? అధ్యయనం అధ్యయనం కొరకేనా? తత్త్వశాస్త్రఅధ్యయనం అధ్యయనంతోనే అంతమవుతుందా? తత్త్వశాస్త్రం చదివి ఏంచేయ్యాలనే ప్రశ్నకువచ్చేజవాబు నైతిక సిద్ధాంతానికి దారితీస్తుంది. నైతిక తత్త్వశాస్త్రాన్ని మౌలికంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. ఒకటి ఆచరణాత్మక నైతిక తత్త్వ శాస్త్రం, రెండవది సైద్ధాంతిక నైతికతత్త్వశాస్త్రం. ఆచరణాత్మకనైతికశాస్త్రం మనుషుల ప్రవర్తనను పరిశీలించి వర్ణిస్తుంది. ప్రవర్తన అంటె ఏమిటి? మంచి అనగానేమి; మానవ జీవితంలో కోరదగిన జీవన శైలి ఏది? అసలు నైతిక సమస్యఏది, నైతికత అంటెఏమిటి, నైతికతకు ప్రమాణమేది, అనే మొదలైన విషయాలను సైద్ధాంతికనైతికశాస్త్రం క్రమబద్ధంగా పరిశీలన చేస్తుంది, చర్చిస్తుంది. నైతిక ప్రవర్తనను నిర్ణయించాలంటే ఈ సమస్య లకు పరిష్కార మార్గాన్ని కనుగొనడం ఎంతో అవసరం. ఈ సమస్యలలో ముఖ్యమైనవాటిని కొన్నింటిని ప్రస్తావిద్దాం.

నైతికత్వాన్ని అంతర్బుద్ధిద్వారా, తెలుసుకోగలమనే వారిని అంత ర్బోధిక వాదులంటారు. బాహ్య ప్రవర్తన ద్వారా తెలుసుకోగలమనే

వారిని అర్థక్రియా వాదులని ఉపయోగవాదులని అంటారు. ఆనందానుభవం ద్వారా తెలుసుకోగలమనే వారిని విలాసవాదులంటారు.

(ఎ) నైతిక "మంచి" అనేది ప్రాకృతిక వస్తువా? ప్రాకృతిక వాదుల ప్రకారం గట్టితనం, పొడవు, వెడల్పు అనేవి ఎట్లు వస్తువులలో భాగాలుగా వుంటాయో, అదేవిధంగా మంచి అనేదిగూడ, వస్తువులలో వుంటుంది. అనగా మంచిని ప్రకృతిలోని వస్తువులాంటిదిగా గుర్తిస్తారు. అంతేగాక, వస్తువుల లక్షణాలను శాస్త్రీయ పద్ధతి ద్వారా ఎట్లు తెలుసుకొంటామో మంచినిగూడ అదే రీతిగా శాస్త్రీయ పద్ధతిద్వారా తెలుసుకోవచ్చునంటారు. అంతర్బుద్ధివాదులు ఈ వాదనను నిరాకరిస్తారు. మంచిని ఒక ప్రాకృతిక వస్తువు స్థాయికి దించివేయగూడదంటారు. (బి) నైతిక భావాలకు మూలం మంచియా (good) లేక సరియైనదా (right)? ఈ ప్రశ్నకు జవాబు లివ్వడంలో అంతర్బుద్ధివాదులు చీలిపోయారు. వీరిలో ఒక వర్గం, విధిలేక మంచియే నైతికత్వానికి మూలమంటారు. వీరిని డీఅంటోలజిస్టులు (deontologists) అంటారు. వీరికి భిన్నంగా "మంచే" నైతిక ప్రమాణానికి మూలమనే వారిని ఆదర్శ ప్రయోజకవాదులు (ideal utilitarians) అంటారు. (సి) నైతిక మంచి ఆత్మాశ్రయమా లేక వస్త్వాశ్రయమా? ఆత్మాశ్రయవాదుల(subjectivists) ప్రకారం ఆనందంతో కూడిన స్పందనలలోను (feelings) లేక ఆమోదముతోకూడిన (approval) నిర్ణయాలలోను నైతిక మంచితనముంటుంది. వస్త్వాశ్రయవాదుల ప్రకారం మంచి అనేది వ్యక్తికి వేరుగా వుంటుంది. ఐతే ఆ వస్తువు మంచిగా చేయబడడంలో ఆ వ్యక్తి యొక్క ఆలోచనగాని, స్పందనలుగాని అశల ప్రమేయమేమి వుండదు. (డి) మంచి అనేది సాధనమా లేక ధ్యేయమా? ప్రాకృతికవాదులు సాధనమంటారు; అంతర్బుద్ధివాదులు ధ్యేయమంటారు. (ఇ) నీతిశాస్త్రమనేది మనుష్యుల కార్యాలకు సంబంధించిన సమస్యా లేక భాషకు సంబంధించిన సమస్యా అనేది నీతి శాస్త్రంలోని అధునాతన వాదాంశంగా తయారైంది. ఉద్రేకవాదులు (emotivists) నీతిశాస్త్రాన్ని తప్పుడు శాస్త్రంగా అభివర్ణించారు. వీరి దృష్టిలో భాషా

విశ్లేషణయే నీతి శాస్త్రంయొక్క పని; కార్యాలతో నీతికి సంబంధం లేదంటారు. శాస్త్రీయ వాఙ్మూలాలలో తార్కిక సంబంధాలను వ్యక్తపర్చడం, అవి కలిగియుండే చిహ్నాలను నిర్వచించడం నైతిక తత్వశాస్త్రపు పని. కాబట్టి నైతిక తత్వశాస్త్రజ్ఞుడు విశ్లేషించేది వస్తువులను కాదు; ఆ వస్తువులను గురించి చెప్పబడే మాటలనే. తాత్విక ప్రతిజ్ఞావాక్యాలు వాస్తవాంశాలు (factual)కాదు, భాషాయుక్తమైనవే. ఉద్రేక నీతిశాస్త్రజ్ఞుల ప్రకారం తాత్త్విక అన్వేషణా వస్తువుయొక్క విషయం భాషే. ఈ ధోరణిని అధినైతిక శాస్త్రమని అనవచ్చుగూడ. క్రియాత్మక (pragmatic) నీతి శాస్త్రజ్ఞుల ప్రకారం మనుష్యుల ప్రవర్తన, కార్యాలే నీతిశాస్త్ర సమస్య. (ఎఫ్) నైతిక తీర్మానాలు సాపేక్షకమా లేక కేవలమా? నైతిక సాపేక్షవాదుల ప్రకారం ఏ ఒక్క సిద్ధాంతాన్నైనా మరొక సిద్ధాంతంతో పోల్చినప్పుడు అది సరియైనది కాకపోవచ్చు. కాబట్టి ఒక కార్యంయొక్క మంచితనం ఎన్నో ప్రమాణాలపై ఆధారపడివుంటుంది. అనగా ఒక కార్యం ఒక పరిస్థితిలో సరియైనదైనా కావచ్చు. మరొక పరిస్థితిలో సరియైనది కాకపోవచ్చు. ఆకలితో అలమటించే వానికి, అన్నీ వున్నవానికి ఒకే నీతి అన్వయించదు. బలవంతునికి బలహీనునికి ఒకే నైతిక ప్రామాణం వర్తించదు; కాబట్టి సాంఘిక, ఆర్థిక, అస్థిత్వ చారిత్రక పరిస్థితుల కనుగుణ్యమైన నీతిశాస్త్రమే సరియైనదని నైతిక సాపేక్షవాదులు వాదిస్తారు. ఐతే వీరికి భిన్నంగా, సార్వత్రికమైన, వస్త్వాశ్రయమైన, మార్పులేని ప్రమాణాలు కొన్ని వున్నవని కేవల నైతిక (absolutistic ethicists) వాదులు ఉద్ఘాటిస్తారు. ప్రపంచం ఒక్కటే; మానవ జాతి ఒక్కటే; కాబట్టి వుండవలసింది ఒకే నైతికశాస్త్రమని వీరంటారు. ప్రపంచంలోని మానవులందరికి సంబంధించి, అందరికి తీర్పు నివ్వగల, ఒక సార్వత్రిక అధికారముండాలని వీరి వాదన. అనగా కాలం, పరిస్థితులు భేదించినా అందరికి, అన్నికాలాల్లో అన్నిస్థలాల్లో అన్ని పరిస్థితుల్లో ఒకే నీతి శాస్త్రముండాలని, వుంటుందని వీరి అభిభాషణ. ఇట్లు లేకపోతే, ఎవరికి వారు తమకనుకూలమైన నీతిశాస్త్రాలను రూపొందించుకుంటారు.

ఈ ధోరణి ఘర్షణలకు అరాచకానికి దారితీయక తప్పదంటారు. (జి) అధి కార (ప్రామాణిక) పూర్వకమైనవి మత సంబంధమైననీతులా లేక తాత్త్విక సంబంధమైనవా అనే అంశం విస్తృతంగా చర్చింపబడుతుంది. మతనీతులు వాస్తవాల కతీతమైనవి. తాత్త్విక నీతులు సార్వత్రికమైనా, ఆచరణ యోగ్యమైనవి కావని కొందరి వాదన. ఈ పరిస్థితుల్లో ప్రజలు వారివారి సాంఘిక, ఆర్థిక, చారిత్రక పరిస్థితులనుబట్టి సందర్భానుసారమైన నీతులను రూపొందించుకోవడమే ఔచిత్యమని తాత్త్వికుల భావన.

మొత్తానికి ఒక్కొక్క యుగంలో, ఒక్కొక్క పరిస్థితిలో ఆనాటి సమస్యా పరిష్కారానికి ఒక నైతిక సూత్రాన్ని రూపొందించుకోవడం, దానిని కేవలమైనదిగా (absolute) ఎంచుకోవడం సహజమే. కాని, ఈ కేవలత్వాన్ని గూడ సాపేక్ష నైతికదృష్టిలో చూడడం చాలఅవసరం. ఎందుకంటే ఈనాటి కేవల సిద్ధాంతం రేపు సాపేక్షమైనదిగా మారవచ్చు. ఈనాటి ఆమోద యోగ్యమైనవి రేపు నిరాకరింపబడవచ్చు. ఇట్లు ఒక నైతిక తీర్మానం సాపేక్షంగా కేవలమైనదిగాను కేవలంగా సాపేక్షమైనదిగాను అవుతుంది. ప్రపంచంలో వాస్తవంగా జరగవలసింది ఇదేనని అస్తిత్వవాదుల ఆశా భావం. ప్రస్తుతంచెలామణి అవుతున్న నైతిక ధోరణులను తాత్త్విక నీతులు, మానవతానీతులు, సాంకేతిక నీతులు, కులమత లౌకిక నీతులు, గ్రామీణ నీతులు పట్టణనీతులు, ప్రాంతీయ నీతులు, జాతీయ నీతులుమొదలగు వర్గాలు వర్గీకరించవచ్చు.

# 6

# ప్రముఖ తత్త్వశాస్త్రజ్ఞులు, వారి సిద్ధాంత సంప్రదాయాలు (SCHOOLS OF THOUGHT)

## 1. పాశ్చాత్య తాత్విక సిద్ధాంత సంప్రదాయాలు

1. కాలక్రమం ప్రకారం పాశ్చాత్య తత్త్వశాస్త్రాలను నాలుగు భాగాలుగా విభజించవచ్చు. అవి ఏవనగా : ఎ. ప్రాచీన తత్త్వశాస్త్రం, బి. మధ్య యుగపు తత్త్వశాస్త్రం సి. ఆధునిక తత్త్వశాస్త్రం, డి. సమకాలీన తత్త్వ శాస్త్రం.

**ప్రాచీన పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు :** గ్రీకు తత్త్వశాస్త్రాన్నే ప్రాచీన పాశ్చాత్య తత్త్వశాస్త్రమంటారు. గ్రీకు తత్త్వశాస్త్రజ్ఞులనందరిని, వారి తాత్త్విక ధోరణులనుబట్టి ఆరు రకాలుగా వర్ణించవచ్చు. 1) విశ్వమూల పదార్థ అన్వేషకులు, 2) మానవకేంద్రిత తత్త్వశాస్త్రజ్ఞులు, 3) అధిభౌతిక తత్త్వశాస్త్రజ్ఞులు, 4) నైతిక తత్త్వశాస్త్రజ్ఞులు 5) విలాసవాదతత్త్వశాస్త్రజ్ఞులు 6) మార్మికతత్త్వశాస్త్రజ్ఞులు.

1. విశ్వమూలపదార్థ అన్వేషకులు : థేల్సు, అనక్సిమాండర్, అనక్సిమినస్, పర్మనీడ్స్ హేరాక్లిటస్.
2. మానవకేంద్రిత తత్త్వశాస్త్రజ్ఞులు (సోఫిస్టులు) ; సోక్రటిస్, డెమోక్రిటస్, ప్రోటోగోరస్.
3. అధిభౌతిక తత్త్వశాస్త్రజ్ఞులు : ప్లేటో, అరిస్టాటిల్
4. ఆత్మ నిగ్రహతత్త్వశాస్త్రజ్ఞులు : జీనో, క్లియాంతెస్, క్రిసిప్పస్.

5. ఆనందవాద, విలాసవాద తత్త్వశాస్త్రజ్ఞులు : ఎపిక్యూరస్, అరిస్టప్పస్.

6. మార్మిక తత్త్వశాస్త్రజ్ఞులు : పైతాగరస్, స్టోయికులు, ప్లాటినస్.

## బి. మధ్యయుగపు పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు

అగస్టీన్, ఏన్సెల్మ్, అక్వినస్, అల్‌కిండి, అల్‌ఫరబి, అవిసెన్నా, (ఇబిన్‌సినా)అవెర్రోస్(ఇబిన్‌రషద్). పునరుజ్జీవ యుగ ఆవిర్భుణ: ఫ్రాన్సిస్ బేకన్, మొదలైనవారు.

## సి. ఆధునిక పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు

1. హేతువాదులు (Rationalists) : డేకార్ట్, స్పినోజా, లైబ్నిజ్.

1. అనుభవికవాదులు (Empiricists) : జాన్‌లాక్, డేవిడ్‌హ్యూమ్ జార్జిబెర్క్లి.

3. భావవాదులు (Idealists) : ఇమ్మానుయెల్‌కాంట్, ఫిష్టె, షెల్లింగ్, హెగెల్, షోపన్‌హవర్, బ్రాడ్లి, క్రోచె.

4. నవ్యహెగెలియనులు (Neo-Hegelians); బొసాంకె, జోసయా రాయిస్, మెక్టగార్ట్.

5. మానవతావాదులు (Humanists) : ఫ్రెడరిక్‌నీచె జూలియన్ హక్స్‌లి, లుడ్‌విగ్ ఫ్యూరబా.

6. గతితార్కిక భౌతికవాదులు (Dialectical Meterialists) : కారల్ మార్క్స్, ఎంజల్స్.

## డి. సమకాలీన పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు

1. అస్తిత్వవాదులు (Existentialists) : సోరెన్‌కీర్క గర్డు, గాబ్రెల్ మార్సెల్, కారల్‌యాస్పర్, ఆల్బర్ట్‌కాము, జీన్‌పాల్‌సాత్, మార్టిన్ హైడగర్.

2. అర్థక్రియవాదులు (pragmatists) : విలియం జేమ్సు, జాన్‌డివి సి.ఎస్. పియర్స్, ఎఫ్.సి.యస్. షిల్లర్.

3. తార్కిక విశ్లేషణా తత్వశాస్త్రజ్ఞులు (Analytical Philosophers): ఎయర్, విట్‌గన్‌స్టెయిన్, జి.ఇ. మూర్.

4. ఇంద్రియభోగట్టా తత్వశాస్త్రజ్ఞులు (Sense-Data Philosophers): బెర్ట్రండ్ రస్సెల్, జి.ఇ. మూర్. జార్జిసంతాయన.

5. వాస్తవికవాదులు (Realists): మూర్, రస్సెల్, బ్రెంటానో, మెయినాంగ్, అలెగ్జాండర్, వైట్‌హెడ్, సంతాయన.

6. తార్కిక ప్రత్యక్ష జ్ఞానవాదులు (Logical Positivists): మారిట్స్ ష్లిక్, కార్నాప్, న్యూరాత్, విట్‌గన్‌స్టెయిన్, రస్సెల్, మూర్.

7. దృగ్విషయ తత్వశాస్త్రజ్ఞులు (Phenomenologists): ఎడ్మండ్ హుస్సెరల్, మెర్లూపాంటె.

8. పరిణామతత్వశాస్త్రజ్ఞులు(Evolutionary Philosophers): డార్విన్, బెర్గసాన్, స్పెన్సర్, మార్గన్, అలగ్జాండర్; థామస్ హక్స్లీ.

9. నైతిక తత్వశాస్త్రజ్ఞులు: జాన్‌స్టూవర్ట్‌మిల్, జెరిమిబెంతామ్.

10. చరిత్ర తత్వశాస్త్రజ్ఞులు (Philosophers of History): స్పెంగ్లర్, కాలింగ్‌వుడ్.

## 2. భారతీయ తాత్త్విక ధోరణులు

భారతీయ తాత్త్విక ధోరణులను ప్రస్తావించె సందర్భంలో ఈ ధోరణులను రూపొందించిన కర్తలను కొంతవరకు వదిలివేశాము. దీనికి కారణం, ఆయా రాతల గ్రంథకర్తృత్వాన్ని గురించి ఎన్నెన్నో వాగ్వివాదాలున్నందున, వారిని ప్రస్తావించకపోవడమే మంచిదని యోచించాము. అందువలన ఇక్కడకొంతమంది గ్రంథకర్తలకు మినహా, ఒట్టి ధోరణులను మాత్రమే సూచించాను. భారతీయ తాత్త్విక ధోరణులను ఈ క్రింది ఎనిమిది భాగాలుగా విభజించవచ్చును.

1. ద్రావిడ తత్వశాస్త్రం, 2. వైదిక యుగ తత్వశాస్త్రం,

3. ఉపనిషత్తుల తత్త్వశాస్త్రం, 4. సంప్రదాయ తత్త్వశాస్త్రం, 5. దార్శనిక తత్త్వశాస్త్రం, 6. మధ్యయుగపు తత్త్వశాస్త్రం, 7. ఆధునిక తత్త్వశాస్త్రం, 8. సమకాలీన తత్త్వశాస్త్రం.

1. ద్రావిడతత్త్వశాస్త్రం : మానవతం, శైవదర్శనం.

2. వైదికయుగ తత్త్వశాస్త్రం : ప్రకృతి ఆరాధన, బహుదేవతారాధన, బహుదేవతలలో ఒక దైవారాధన, (ఇష్టదైవారాధన), ఏకదైవారాధన.

3. ఉపనిషత్తుల తత్త్వశాస్త్రం : అద్వైతవాదం, బ్రాహ్మ సిద్ధాంతం, జీవాత్మ-పరమాత్మలపై చర్చ.

3. దార్శనిక తత్త్వశాస్త్రం

ఎ. నాస్తిక దార్శనికులు :

బృహస్పతి (చార్వాక,) సిద్ధార్థుడు (బౌద్ధ) మహావీరుడు (జైన)

బి. ఆస్తిక దార్శనికులు :

గౌతమ, లేక అక్షపాద (న్యాయ), కనాద (వైశేషిక) కపిల (సాంఖ్య), పతాంజలి (యోగ) జైమిని (మీమాంస,) కుమారిలభట్ట, ప్రభాకర (పూర్ణమిమాంస).

4. సంప్రదాయ తత్త్వశాస్త్రం : శంకరాచారి (అద్వైత తత్త్వశాస్త్రం), మాధ్వాచారి (ద్వైత తత్త్వశాస్త్రం), రామానుజాచారి (విశిష్టాద్వైత తత్త్వ శాస్త్రం), ఉత్తరకాలీన వైష్ణవ సిద్ధాంతికులు : నింబార్క, వల్లభ, చైతన్య, జీవగోస్వామి, బలదేవ.

5. మధ్యయుగపు తత్త్వశాస్త్రం: మార్మికతత్త్వశాస్త్రాలు, భక్తితత్త్వశాస్త్రాలు.

6. ఆధునిక తత్త్వశాస్త్రం : వివేకానంద (ప్రాక్ పశ్చిమ సంశ్లేషణాత్మక తత్త్వశాస్త్రం), ఎం.ఎన్. రాయ్, (రాడికల్ మానవతా వాదం) రామమోహన్‌రాయ్ (నవభారత సాంస్కృతిక తత్త్వశాస్త్రం) రాధాక్రిష్ణన్ [కేవల మతం] మహమ్మద్ ఎక్బాల్ [సంకల్పాత్మక తత్త్వశాస్త్రం] శ్రీ అరబిందో

[సమగ్ర తత్త్వశాస్త్రం], రవీంద్రనాథ్‌టాగూర్ [ప్రాకృతిక మానవతం], 7) ఎం.కె గాంధి [సర్వోదయ తత్త్వశాస్త్రం], 8) బి.జి. తిలక్ [తీవ్ర వాద రాజకీయ తత్త్వశాస్త్రం] 9) కుమారస్వామి [కళాతత్త్వశాస్త్రం.]

7. సమకాలీన తాత్త్వికధోరణులు : జిడ్డు కృష్ణమూర్తి [అస్తిత్వ ప్రాపంచిక దృక్పథం], కాళిదాస భట్టాచార్య [అద్వైత తత్త్వశాస్త్రం], సచ్చిదానందమూర్తి [అద్వైత తత్త్వశాస్త్రం].

# 7

# ప్రాక్ పశ్చిమ తాత్త్విక ధోరణులు : తారతమ్యాలు

## ఎ. పశ్చిమ తత్త్వశాస్త్రాలు :

### మేధాశక్తి (INTELLECT)

ప్రాక్ పశ్చిమ తత్త్వశాస్త్రాలు అనే వర్గీకరణలో ఒకవైపు అర్థ రాహిత్యం వ్యక్తమవుతుంది; మరొకవైపు తాత్త్విక సాపేక్షత స్పష్టమవు తుంది. వాస్తవంగా తాత్త్విక జిజ్ఞాసకు భౌగోళిక పరిమితులుండవు, వుండ నవసరం లేదుగూడ. కాని, కొన్ని పాదార్థిక విశిష్టతల పర్యవసానమైన పరి స్థితులను ప్రతిస్పందించేటప్పుడు, మనుషుల భావాలలో తేడాలు వెలుగులోకి వస్తుంటాయి. ఆ పరిస్థితులను అధ్యయనం చేయడంలోను, విశ్లేషించడంలోను తత్త్వశాస్త్రజ్ఞులు విభిన్న పద్ధతులను వాడుతుంటారు.

పాశ్చాత్య సమాజాలు సంచార (mobile) సమాజాలు; ప్రాచీన పాశ్చాత్య చరిత్రలో వేలాది సంవత్సరాలుగా ఒకే స్థలంలో నివసించిన సమా జాలు చాల తక్కువ. కొత్త ప్రదేశాలు, కొత్త పరిసరాలు, కొత్త ప్రజల సంబంధాలకు తరచుగా వారు పరిచయం చేయబడ్డారు. అందువలన ప్రతి క్షణం కొత్తపరిసరాలను ప్రజలను అర్థంచేసుకోవలసిన అవసరత గుర్తిం చారు. అర్థంచేసుకొనే ఈ ప్రక్రియలో ఆలోచన యొక్క అగ్రి ప్రాధాన్యం ముందుకు వచ్చింది. ఇట్లు ఆలోచన, మేధాశక్తి పాశ్చాత్య అవగాహనలో ప్రముఖపాత్ర వహించాయి. ఈ సంచారచింతన రాను రాను, పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞుల తాత్త్విక స్వభావంగా రూపొందింది.

అంతిమ (ultimate) సత్యాలు మరియు భౌతిక అధిభౌతిక వాస్తవాల అధ్యయనంలో, పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు మేధస్సును, మరి విశేషంగా వివేచనను (reason) పుష్కలంగా ఒక సాధనంగా వాడు కొన్నారు. ఆలోచించడం, అర్థం చేసుకోవడం, వివేచనాత్మకంగా పరిశీలించడం, విశ్లేషించడం పాశ్చాత్య తాత్త్విక జిజ్ఞాస ప్రత్యేకతలలో ఒకటి. అనగా మనిషికి, మనిషి కృషికి, మేధస్సుకు పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు ప్రాముఖ్యత ఇచ్చారు.

## 2. విజ్ఞానశాస్త్ర ప్రభావం :

ఎక్కువమంది పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు వారి తాత్త్విక చింతనను వ్యక్తపరచక పూర్వం అటు విజ్ఞాన తత్త్వశాస్త్రజ్ఞులుగానో లేక గణిత శాస్త్రజ్ఞులుగానో నిష్ణాతులుగా ప్రఖ్యాతిచెందియున్నారు. ఆ విజ్ఞానశాస్త్రాన్ని వారి తాత్త్విక వ్యాయామాల్లో విశేషంగా వాడుకొన్నారు. అరిస్టాటిల్, డేకాట్, వైట్ హెడ్, రస్సెల్, ఈ మధ్యనే తాత్త్విక ప్రపంచంలో విశిష్టతను సంపాదించిన విట్‌గన్‌స్టెయిన్, హుస్సరల్ మొదలగువారు, అటు విజ్ఞానశాస్త్రజ్ఞులో లేక గణితశాస్త్రజ్ఞులో అయి వున్నారు. ఈ శాస్త్రాల ప్రభావం తత్త్వశాస్త్రాలను రూపొందించడానికి వారు వాడిన పద్ధతులలో ఎక్కువగా కనిపిస్తుంది. ఉ॥ సత్యాన్ని తెలుసుకొనే అన్వేషణలో ఎక్కువమంది పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు తర్కశాస్త్రాన్ని, మరి ముఖ్యంగా తర్కశాస్త్రంలోని న్యాయ ప్రయోగాన్ని స్వేచ్ఛగా వాడు కొన్నారు. దీనితోబాటు, విజ్ఞానశాస్త్ర పద్ధతిని (scientific method) అనివార్యంగా వాడారు. శాస్త్రీయత సామాజిక బహ్యాత్మక నిరూపణకు భయపడదు. ఇది అందరికి ఒకేరీతిగా అన్వయిస్తుంది; అందువల్ల ఒకే రీతిగా వ్యవహరిస్తుంది. ఉ॥ గురుత్వాకర్షణ అనేది ఒక వ్యక్తి గ్రహింపుకు పరిమితమైనదికాదు. ఇది అందరు గమనించగలిగినది. మనుష్యుల ఇష్టాయిష్టాలను బట్టి ఈ సూత్రం మారదు. ఇదే శాస్త్రీయ పద్ధతిలోని ప్రత్యేకత.

ఇట్లు శాస్త్రీయ పద్ధతిని వాడని తత్త్వశాస్త్రాలనుగాని, లేక దానిని

ఎదుర్కొనడానికి సంకోచించిన తత్త్వశాస్త్రాలనుగాని, తత్త్వశాస్త్ర పరిధి లోకి రానియ్యడానికి చాలసార్లు నిరాకరించడంగూడ జరిగింది. అసలు శాస్త్రీయ పద్ధతికి వేరుగా రూపొందించబడిన తత్త్వశాస్త్రాల సత్యాన్ని వాస్త వికతను, విలువను సంకోచించారుగూడ. తత్త్వశాస్త్రాన్ని రూపొందించే సందర్భంలో ఈ శాస్త్రీయ పద్ధతిని అమల్లో పెట్టడంలోగాని, శాస్త్రీయ దృక్పథానికి కట్టుబడి వుండడంలోగాని మానవప్రమేయం అధికంగావున్నట్లు చూడగలం. ఆ మాటకువస్తే దేవుడు, దేవతలు, ఆత్మలు మొదలగు కంటికి కనిపించని, మనసుకు పూర్తిగా గోచరంగాని అంశాలను అధ్యయనం చేసేటప్పుడు సహితం, పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు శాస్త్రీయపద్ధతినే ఆధి కంగా వాడినట్లు చూడగలం. ఈ విధంగా పాశ్చాత్య తత్త్వశాస్త్రాలు శాస్త్రీయ దృక్పథానికి శాస్త్రీయ పద్ధతికి చాల ప్రఖ్యాతిగాంచాయి.

## 3. చారిత్రాత్మకత :

పాశ్చాత్య తాత్త్విక చరిత్రలో విశిష్టమైన మరొక లక్షణం చరిత్రా త్మకత. చరిత్రాత్మకత అంటె జరిగిన విషయాల రికార్డుకాదు; నమోదు చేయబడిన గతించిన విషయాలుకాదు. పుస్తకాలలో లిఖితమైన సంఘటనలు కాదు; చరిత్రఅంటె, ప్రాకృతిక స్వాభావిక జీవితశైలిని, ప్రతిఘటించడం, మార్చడం; ఒక లక్ష్యసాధనకై సరికొత్త మలుపుకు దారితీయడం ఉ॥ రాళ్ళు, చెట్లు, నదులు మొదలైనవి వాటి వాటి స్వభావాన్నిబట్టి వాటి అంతర్గత ధర్మాలనుబట్టి వుంటాయి. వాటి స్వభావానికి వేరుగా గాని, వ్యతిరేకంగా గాని అవి నడవలేవు. ఒక నది అది ఒకే దిక్కుకు ఎందుకు ప్రవహించాలి. మరొక దిక్కుకు ఎందుకు ప్రవహించగూడదు అనే ప్రశ్న కిక్కడ తావులేదు. ఇవన్నీ ప్రాకృతిక ధర్మాలననుసరించి నడుస్తుంటాయి. సూర్యునిచుట్టూ భూమి ఎందుకు ప్రదక్షిణం చేయాలి; సూర్యుడే ఎందుకు భూమిచుట్టూ ప్రదక్షిణం చేయకూడదనే ప్రశ్నకిక్కడ అర్థముండదు. వీటన్నింటిలో మనం గమనించేదేమంటె ప్రకృతి దానిలో అంతర్గతమై యున్న ధర్మాలకు భిన్నంగా పోలేదు; ఈ విధంగా తన ఇష్టం వచ్చినట్లుపోలేని

తనాన్ని నిర్ణయించబడిన (determined) పరిస్థితి అంటాము. అనగా ప్రకృతిలో లేక ప్రాకృతిక ధోరణిలో స్వేచ్ఛకు తావులేదు. ఐతే స్వధర్మాలచే నిర్ణయించబడిన ప్రకృతికి, ప్రాకృతిక ధర్మాలకు కట్టుబడివుండె జీవనశైలికి అడ్డంతిరిగి, దానిని మార్చడానికి చేసే ప్రయత్నాలలో చరిత్ర ఇమిడి వుండి. సమాజాలు పూర్వంనుండి ఎట్లావున్నాయో అలాగే వుండాలనడం ప్రాకృతికం: పరిస్థితులనుబట్టి మానవ ఆశలు ఆశయాలనుబట్టి సమాజాలను మార్చడంలో చారిత్రకత ఇమిడివుంది.

రెండవదిగా "చారిత్రాత్మకత" అనే లక్షణం మాయలు మంత్రాలతో గూడిన సందర్భాలకు గాని కట్టుకథలు, కల్పితకథలు, పురాణగాథలకుగాని సంబంధించిందికాదు. కాల స్థలాలకతీతంగా జరిగినవని చెప్పబడే దేనికైనా సరే చారిత్రాత్మకత అనే లక్షణాన్ని ఆపాదించలేము. చరిత్ర అనేది ఏదో ఒక స్థలంలో, ఒక సమయంలో జరిగియుండాలి ఏ సంఘటనకైనా, సంభవానికైనా చారిత్రాత్మకత అనే లక్షణాన్ని ఆపాదించాలంటె, ఆ సంఘటన (event) లేక ఆ సంభవం (happening) కాల స్థలాల పరిధిలోనే జరగాలి. సమాజ భవిష్యత్తును రూపొందించగలిగిన, లేక నిర్ణయించగలిగిన శక్తుల, లేక వ్యక్తుల తీర్మానాలు సంఘటన అనే పదంలో వ్యక్తమౌతాయి. సమాజంలోని అధిక సంఖ్యాకులైన మనుషుల జీవితాలకు హానిగాని లేక మేలుగాని చేయగలిగిన కార్యాలను, లేక ఎక్కువమంది చైతన్యాలను స్పందించగలిగిన సంఘటనను చరిత్రాత్మకమైనదిగా నిర్వచించవచ్చు.

అయితే సంభవమనే పదం, వ్యక్తుల తీర్మానాలుగాని, ప్రయత్నాలుగాని లేకుండానే జరిగే వాటిని సూచిస్తుంది. ఇక్కడ ఉద్దేశాలు, లక్ష్యాలు సంకల్పాలతో జోక్యం వుండదు. ఉ॥ చెట్టు విరిగి పడిపోతే అది చరిత్ర కాదు; కుక్క చచ్చిపోతే దానిని చరిత్రాత్మక విషయంగా పరిగణించరు; మనిషి పిడుగుపడి చనిపోతే అది చరిత్రాత్మక విషయం కానేరదు. కాని రెండు దేశాలమధ్య యుద్ధంజరిగితే దానిని చరిత్రాత్మక సంఘటనగా

వర్ణిస్తారు. కారణం? ఇక్కడ సంకల్పాల, సామాజిక లక్ష్యాల ప్రమేయముంది. మనుషుల స్వేచ్ఛను, భవిష్యత్తును నిర్ణయించగల ప్రభావముంది. కాబట్టి కాల స్థలాల మధ్య జరిగిన సంఘటనలకు, సమాజం మీద ఆ సంఘటనల ప్రభావాన్నిబట్టి కాల స్థలాలమధ్య జీవించె వ్యక్తుల ప్రభావాన్నిబట్టి, ప్రాకృతిక జీవన విధానాన్ని మార్చగలిగిన ధోరణినిబట్టి చరిత్రాత్మకత ఆపాదించబడుతుంది.

పాశ్చాత్య తత్వశాస్త్రం కాల స్థలాలమధ్య జరిగిన జరుగుతూన్న సంఘటనలు, పరిణామాలకు ప్రత్యుత్తరంగా రూపొందించబడుట చేతను, సనాతన సంప్రదాయాలకు లేక మార్పులేనివిగా ఎంచబడిన జీవనశైలికి తిరుగుబాటుచేసి, మానవ స్వేచ్ఛ, లక్ష్యసాధనల దృష్ట్యే వాటిని మార్చే ప్రయత్నం చేయడంవలనను, అది చరిత్రాత్మకతపై నిలబడింది అని చెప్పవచ్చు.

## 4. సామాజిక స్పృహ

పాశ్చాత్య తత్వశాస్త్రాన్ని పాశ్చాత్య సమాజాలలోని వాస్తవాల దృష్ట్యే రూపొందించారు. సమాజంలోని దైనందిన పరిస్థితులు, పరిణామాలు' సవాళ్లు, సమస్యలు ఈ తత్వశాస్త్రాలకు ప్రేరణ శక్తులుగా పనిచేశాయి. కాబట్టి పాశ్చాత్య తత్వశాస్త్రాలు ఏ సమాజాల్లో నుండి ఉద్భవించాయో ఆ సమాజాల చైతన్యానికి, వివేచనాత్మక జీవనశైలికి అభివృద్ధికి అర్థవంతమైన భవిష్యత్తుకు బాధ్యత వహించాయి. ఇట్లు ఈ తత్వశాస్త్రాల్లో సామాజిక స్పృహ కొట్టవచ్చినట్లు కనిపిస్తుంటుంది. కేవలం వ్యక్తి విమోచనకు మాత్రమే పరిమితమైవున్న తత్వశాస్త్రాలు పాశ్చాత్య తాత్త్విక లోకంలో చాల తక్కువ.

సమాజాలపట్ల మానవ పరిస్థితులపట్ల బలీయమైన బాధ, వ్యధ, బాధ్యత, సవాలు ఎక్కువమంది పాశ్చాత్య తత్వశాస్త్రజ్ఞుల్లో కనిపిస్తుంది. తత్వశాస్త్రాన్ని రూపొందించడంలో ఒక్కొక్క తత్వశాస్త్రజ్ఞుని దృష్టి ఒక ప్రత్యేకమైన సమాజం, దానికి సంబంధితమైన ఒక లక్ష్యంపై కేంద్రీకరించ

బడింది. ఇట్లు వారి తత్త్వశాస్త్రాలు సాంస్కృతికంగా సుసంగతమైనవిగాను, సందర్భానికి తగినవిగాను పనిచేశాయి. రాజ్యాలను స్థాపించడంలోను, సరికొత్త పాలక విధానాలకు పునాదులు వేయడంలోను పాశ్చాత్య తత్త్వశాస్త్రాల ప్రమేయం ఎంతో వుంది. అందువల్లనే పాశ్చాత్య దేశాల్లో తత్త్వశాస్త్రాలు మారుతూవుంటాయి. ఒక్కొక్క సందర్భానికి సరికొత్త తత్త్వశాస్త్రాన్ని రూపొందిస్తుంటారు. ఈ కారణంచేత ఇక్కడ తత్త్వశాస్త్రజ్ఞులంటె ఒక వర్గం గౌరవాన్ని మరొక వర్గం భయాన్ని వ్యక్తపరుస్తుంటాయి.

## బి. ప్రాచ్య తత్త్వశాస్త్రాలు :

### 1. అంతర్బుద్ధి : (INTUITION)

ప్రాచ్యదేశాలలోని ప్రజలు శతాబ్దాల తరబడి ఒకే దేశానికి పరిసరానికి పరిమితమై జీవించారు. వీరికి చలనత్వం (mobility) తక్కువ. కొత్త మనుష్యులు, కొత్త సమాజాలతోకంటె, వారి చుట్టూ నిరంతరముండె ప్రకృతితో వీరికి సంబంధం అభివృద్ధి అయింది. కాబట్టి వీరిదృష్టి ప్రకృతిపై పాకృతిక శక్తులపై కేంద్రీకరించబడింది. ప్రకృతిపైననే వీరెక్కువగా ప్రతిబింబించారు. ప్రకృతిపై జరిగిన ప్రతిబింబ ఫలితంగానే వీరిలో అనేక భావాలు చెలరేగాయి. అనగా వాస్తవంపట్ల వీరు వ్యక్తపర్చిన భావాలు చాలవరకు ప్రకృతి జనితాలు. విశ్వాన్ని గురించి విశ్వానికి వెనకనున్న శక్తులను గురించి, విశ్వంలో దైవత్వాన్ని గురించి ఆ శక్తులకు మనుషులకు మధ్య వుండె సంబంధాలను గురించిన అన్వేషణ చాలవరకు అంతర్బుద్ధి ద్వారానే జరిగింది. ఈ అన్వేషణను జరిగించినవారు కవులు, ఋషులు, మునులు మొదలైనవారు. వీరిలో ఎక్కువమంది దైవశక్తిచేత దైవాత్మ ప్రేరణ ప్రభావితులై వాస్తవాన్ని గురించిన విషయాలను వ్యక్తపర్చినట్లు చెబుతారు. ఈ కవులు, ఋషులు మేధాశక్తి కంటె దైవశక్తికి విజ్ఞానశాస్త్రంకంటె అంతర్బుద్ధికి అత్యధిక ప్రాముఖ్యత ఇచ్చారు. ఈ సందర్భంలో ప్రజ్ఞ లేక మేధాశక్తి కంటె అంతర్బుద్ధి ఉన్నతమైన జ్ఞాన

మార్గంగా గుర్తించబడింది. మేథాశక్తికి గోచరంకానివి అంతర్బుద్ధికి సాధ్యమవుతాయని వీరి అంచనా. ఐతే అంతర్బుద్ధిని నిర్ధారించి నిరూపించే సరియైన మార్గం ఇంకా దొరకలేదు. అనగా అంతర్బోద్ధిక వాఙ్మూలాలను ఋజువు పర్చడం సుళువైన పనికాదని తెలుస్తుంది. కాబట్టి అంతర్బోద్ధిక ఉద్ఘాటనలు నలుగురిలో గందరగోళాన్ని సృష్టించే అపాయం చాల వుంది. దేనిని అంతర్బుద్ధితో చేసిన తీర్మానమనాలి? దేనిని కాదనాలి? ఈ ప్రశ్న ప్రశ్నగానే మనల నెదుర్కొంటుంది.

## 2. ప్రాకృతికత (NATURALITY)

చాల వరకు ప్రాచ్యదేశాల తత్త్వశాస్త్రం మనుషుల అంతర్బుద్ధితో ప్రకృతిపై చేసిన పరిశీలనాఫలితంగా రూపొందింది. ప్రకృతియే ప్రాచ్య తత్త్వశాస్త్రాల ప్రాప్తి స్థానం అన్నట్లు నిర్ధారించారు. ప్రకృతి తన స్వభావాన్నిబట్టి (ధర్మాలు) నడుస్తున్నట్లు, మనుష్యులకు గూడ రకరకాల విభిన్నమైన స్వభావాలుంటాయని, వాటి ప్రకారం మనుష్యుల జీవితాలు రూపొందుతుంటాయని భావించబడింది. ఉ॥ భారతీయ సాంఘిక చట్టాన్ని చూడండి. ఇది వ్యక్తుల స్వభావానికి ముడివేయబడింది. తిరిగి ఆ స్వభావం వారి పూర్వజన్మ సుకృత కర్మలకు ముడివేయబడింది. ఇట్లు వ్యక్తిజన్మకు కర్మకు స్వధర్మకు స్వభావానికి మధ్యనుండె సంబంధాలు మార్పులేని ధర్మంగా చిత్రించబడ్డాయి. మార్పుకు తావియ్యని ఈ శాశ్వతత్త్వంలో ప్రాకృతికత ఇమిడివుంది. ఈ ధోరణినిబట్టి భారతీయ సమాజం పూర్వమెట్లున్నదో ఇప్పుడు, ఎల్లప్పుడు అలాగే వుండాలి అనే భావన బలపర్చబడింది. ఇక్కడ మార్పుకు తావుండదు. ప్రకృతి తన ధర్మాన్ని బట్టి నడుస్తున్నట్లు మనుష్యులు, వారి వారి స్వభావాలను బట్టి నిర్ణయించిన జీవిత ప్రమాణం ప్రకారం జీవించాలన్నమాట. ఇదే ప్రాకృతిక ధోరణికి ప్రతీక. ఈ ప్రాకృతిక తత్త్వాన్ని ప్రతిఘటించె ధోరణులు ప్రాచ్య తత్త్వశాస్త్రాల్లో తక్కువగా వున్నాయి. ఐతే మార్పుకు స్వస్థిజెప్పె ధోరణులకు ఆధునిక ప్రాచ్య తత్త్వశాస్త్రాలు పీడ్కోలిచ్చాయి. ఈ సత్యం ప్రాచ్యదేశాల రాజ్యాం

గాల్లోనూ, సామాజిక మార్పుల్లోను స్పష్టంగా చూడగలం.

## 4. ఆత్మసిద్ధి (SELF-REALIZATION)

ప్రాచ్యదేశాల తత్త్వశాస్త్రాల్లో ప్రత్యక్షమయ్యే సామాన్య సత్యాలలో వైయక్తిక తత్త్వం ఒకటి. సామాజిక విముక్తికంటె, వ్యక్తి విముక్తికి ఎక్కువ ప్రాధాన్యత ఇయ్యబడింది. లోక కళ్యాణం, సర్వోదయ అనే భావాలు చెలామణిలోవున్నప్పటికి, వాస్తవ జీవితంలోను, తాత్త్విక అంతిమ లక్ష్యంలోను అత్యుత్తమమైనదిగా ఎంచబడింది మాత్రం ఆత్మసిద్ధియే. అందువల్లనే వ్యక్తులు సమాజాలను విడిచిపెట్టి, నిర్మానుష్య ప్రదేశాలలో ఆత్మసిద్ధికొరకు కృషిచేస్తుంటారు. ఇక్కడ ఆత్మసిద్ధి సామాజిక సేవనుండి లేక సమాజంపట్ల బాధ్యత నుండి వేరుగా వ్యవహరించబడింది. ఉ॥ కర్మసిద్ధాంతం. ఇది సామాజిక విమోచనకంటె ఆత్మసిద్ధికి ఎక్కువ ప్రమేయమిస్తుంది. సామజిక సమస్యలకు రెండవ స్థానం మాత్రమే ఇచ్చారు. ప్రాక్ పశ్చిమ తత్త్వశాస్త్రాల్లోని విశిష్టమైన లక్షణాలు, వాటి భేదాభేదాలు చాలవరకు సంప్రదాయ ప్రభావితమైన సమాజాలకు మాత్రమే పరిమితమైయున్నాయని ఒప్పుకోవాలి.

## సి. సరిహద్దుల నధిగమించగల తత్త్వశాస్త్రాలు :

## 1. అంతర్లీనం (OVERLAPING)

ఈనాడు ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్రాలనే పదాన్ని వాడాలంటె కొంచెం వెనక ముందు ఆలోచించవలసిన అవసరతవచ్చింది. ఎందుకంటె ఆధునిక ప్రపంచంలోజరిగిన, జరుగుతూవున్న రకరకాల భౌతికపరిమాణాలఫలితంగా దేశ దేశాల్లో భావాల మార్పిడి విరివిగా జరిగింది. ప్రాచ్యతత్త్వశాస్త్రాల్లోని కొన్ని భావాలను పశ్చిమ దేశస్థులు స్వీకరించారు; అంగీకరించారు; ఆచరణలో పెడుతున్నారుగూడ. అదేవిధంగా పాశ్చాత్య తాత్త్విక భావాలు ప్రాచ్యదేశస్థులు జీర్ణింపజేసుకున్నారు; అవి ప్రాచ్య దేశీయుల

భావాలలో కలిసిపోయాయి. ఈ అంతర్లీనం చాల వేగంగా సాగిపోతుంది. కాబట్టి ఈనాడు తాత్త్విక భావాలను ప్రాక్ పశ్చిమ పరిధిలో పరిమితం చేసి మాట్లాడడం సమంజసం కాదనవచ్చు. భౌగోళికసరిహద్దులను సాంస్కృతిక వలయాలను అధిగమించిన భావాలను ఈనాడు వింటున్నాం. చదువుతున్నాం. కాబట్టి ఈనాటి తత్త్వశాస్త్రాలను భౌగోళిక సరిహద్దులను బట్టి వర్గీకరించడంకంటే, సమస్యలను (issues) బట్టి వివాదాస్పదమైన చర్చనీయాంశాలను బట్టి వర్గీకరించడం కోరదగిన ధోరణి.

## 2. అంతరచర్య (INTERACTION)

ఆధునికయుగం అంతర తాత్త్విక చర్యలకు ప్రసిద్ధిగాంచింది. ఎవరిభావం ముందు ఉద్భవించింది, ఎవరిది తరువాత వచ్చింది అనే ప్రశ్నలకు విలువ తగ్గిపోయింది. వివిధ దేశాల్లోని ప్రజలమధ్య జరుగుతున్న అంతర చర్యల వలన ఏ తత్త్వశాస్త్రం, లేక ఏ తాత్త్విక భావాలు మానవ భవిష్యత్తుకు తోడ్పడతాయి అనేది అసలుసిసలైన తాత్త్విక ప్రశ్నగా ముందుకువచ్చింది. వివేచనాత్మకమైన మానవ జీవితానికి ఏ తత్త్వశాస్త్రం పునాదులు వేస్తుందో దానినే విలువైనదిగా గుర్తిస్తున్నారు.

## 3. అంతరమానవ సంబంధాలు (INTER-HUMAN RELATIONS)

మనుషుల్లో రకరకాల సాంస్కృతిక భేదాలుంటె వుండవచ్చు. కాని, ఈ సాంస్కృతికభేదాలకంటె మనుష్యుల్లోని కొన్ని సామాన్యలక్షణాలు, అధిగమించలేని బలీయమయిన శక్తులుగా పనిచేస్తూనేవుంటాయి. అందువల్లనే మానవ సామాన్య లక్షణాలచే ప్రభావితులైనవారు సాంస్కృతిక విభేదాల కతీతంగా జీవించగలుగుతున్నారు. ఈ స్థాయినందుకున్నవారు సార్వత్రికంగా, వివేచనాత్మకంగా జీవించేవారని చెప్పడంలో ఏమాత్రం పొరపాటు లేదు. నేటి ప్రపంచం మనుషుల దృష్టిలో చాల చిన్నదిగా కనిపిస్తుంది. మానవుడే దీనిని ఒక చిన్న ప్రపంచంగా కుంచింపజేశాడు. ఒకనాడు తత్త్వ

శాస్త్రాలు మతభావాలకో, లేక ఆర్థిక పరిస్థితులకో లేక భౌగోళిక పరిసరాలకో పరిమితమయి యుండవచ్చునేమో గాని ఈనాడు వీటన్నింటిని అధిగమించిన సార్వత్రిక స్థాయిలో వుంటేనే అర్థవంతమైనవిగా ఎంచబడుతున్నాయి. దీని పర్యవసానంగా మానవ స్వభావాలు, సమస్యలు, కోరికలు, ఆదర్శాలు, విలువలు మొదలైనవాటి దృష్ట్యా తత్త్వశాస్త్రాలు రూపొందించబడుతున్నాయి. తాత్విక దృష్టిలో వ్యవహరించే వ్యక్తులను అధికంగా కలిగిన సమాజాలలో అన్యాయం, అక్రమం, దోపిడి, అరాచకం, అత్యాచారం, మొదలైనవి తక్కువస్థాయిలో వుంటాయి; మానవవిలువల పరిరక్షణ, శాంతి, సమగ్ర అభివృద్ధి మొదలైనవి పెద్ద మోతాదులో ఆచరణలో పెట్టబడుతుంటాయి. ఈ దృక్పథంలేని సమాజాల్లో అంతః కలహాలు, ద్వేషాలు, మోసాలు దోపిడీలు మొదలైన మానవ విహీన కార్యాలు అత్యధింగా ఉంటాయి. తాత్త్విక దృష్టిచే ప్రభావితమయి, నడిపించబడే సమాజాలకు కోరదగిన భవిష్యత్తువుంటుంది. ఈ ధోరణిలేని సమాజాలు సంకుచితత్వంలో క్షణిక భావాలలో అమానవత్వంలో మునిగిపోతాయి.

8

# ఆధునిక భారతీయులు ఆశిస్తున్న తత్త్వశాస్త్రం

## 1. వాస్తవాలను ప్రతిబింబించే తత్త్వశాస్త్రం

భూమిమీద మొలకెత్తిన సమస్యలకు స్వర్గాలనుండి జవాబులు తీసుకొనిరావడం, భౌతిక సమస్యలకు అధిభౌతిక జవాబులు కురిపించడం అస్తిత్వ సమస్యలకు ఆధ్యాత్మిక జవాబులివ్వడాన్ని వాస్తవ పరిస్థితులు సవాలు చేస్తున్నాయి. వాస్తవాన్ని ముట్టకుండా, పరిశీలన చేయకుండానే ఊహాగానాలపైన ఆధారపడి అవాస్తవమైన జవాబులనిచ్చే తత్త్వశాస్త్రజ్ఞులకు వారి భావాలు మార్చుకోవాలని, లేక పునర్నిర్మించుకోవాలని, ఈ కాలపు మానవ సమస్యలు ఆక్రోశిస్తున్నాయి.

ఇది విజ్ఞానశాస్త్రీయ యుగం. మనలో కొందరం సాంకేతిక ప్రభావితమైన సమాజంలో మునుగుతున్నాం, మరికొందరం తేలుతున్నాం. సంప్రదాయాల చాటున దాగుకొనివున్న దుష్ట ధోరణులను బయట పెట్టడానికితోడ్పడుతున్న మహావిలువగల సాధనాలలో విజ్ఞానశాస్త్రం, సాంకేతిక జ్ఞానం ముఖ్యమైనవి. విశ్వాసానికి విజ్ఞానానికి, సంప్రదాయాలకు, సైన్సుకు, తిరోగమనానికి పురోగమనానికి, గతానికి భవిష్యత్తుకు, స్వార్థవిలువలకు సాంఘిక విలువలకు, ప్రాచీన సమాజానికి నవసమాజానికి, వర్గ అభిరుచులకు విశ్వప్రగతికి మధ్య రగులుకున్న సంఘర్షణకు రాపిడి ఎక్కువైన రోజులివి. ఈ వాస్తవానికితగిన, అవసరమైన, సందర్భానుసారమైన మార్గాన్ని నిర్దేశించడానికి బదులు అధిక సంఖ్యాకులైన మన తాత్త్విక పండితులు మనకు కనిపించని, మన గ్రహింపుకు అతీతమైన ప్రాప్తి

స్థానాలలో (ఆకాశవీథుల్లో)అపరిష్కృతమైన తాత్త్విక జవాబులనిస్తున్నారు. ఈ ధోరణి వలన ఈ యుగానికి తీరని అన్యాయం జరుగుతుంది.

ఈనాడు తలెత్తుతున్న పరిణామాలను ఎదుర్కొనడానికి రచయితలు, కవులు, గాయకులు, పలురకాల కళాకారులు, సాంఘిక క్రియోన్ముఖులు వారి వారి పరిధిలో కృషిచేస్తున్నారు. సమస్య పరిష్కారానికి తగిన, సుసంగతమైన నడిపింపు సూత్రాలనిస్తున్నారు. మనతత్త్వశాస్త్రజ్ఞులైతే అన్ని జబ్బులకొకటే మందు అన్నట్లు ఈనాటి సమస్యలన్నింటికి పరిష్కారం ఏనాడో రాయబడిన మతగ్రంథాల్లో వుందనడం అతిసామాన్యమైన ధోరణిగా మిగిలిపోయింది. ఏనాడో రాసిన వేదాల్లోనో, బైబిల్లోనో, ఖొరానులోనో, ఈనాటి సమస్యలన్నింటికి కావలసిన జవాబులున్నాయని బజాయించడం మామూలైపోయింది.

పైగా, ఇప్పుడెదుర్కొంటున్న సమస్యలను పట్టించుకోకుండా ఎప్పుడో, భవిష్యత్తులో, చచ్చిన తరువాత స్వర్గంవస్తుందని, అది సమస్యలులేని జీవితమని చెబుతూ ఈనాటి సమస్యలను దాటవేసే తత్త్వశాస్త్రజ్ఞులకు ఈ రోజుల్లో పుష్టిగా పోషణ దొరుకుతుంది. ఈలాంటి బాధ్యతారహితమైన తత్త్వశాస్త్రాలే తత్త్వశాస్త్రపు ఉపయోగతను శంకింపజేసే సాదనాలు.

## 2. సాంస్కృతిక బహుళత్వాన్ని మన్నించే తత్త్వశాస్త్రం

సాధారణంగా భారతీయ తాత్త్విక సంప్రదాయం వేదాలనుండి ప్రారంభమైనదనడం సంప్రదాయమైపోయింది. వాస్తవానికి భారతీయ ఆలోచనా సంస్కృతులు వేదాలనుండిగాని, ఆర్యుల రాకతోగాని ప్రారంభమవ్వలేదు. ఆర్యులు ఇండియాకు రాకపూర్వం, వేదాలు రాయబడకపూర్వం ఇండియా లేకపోలేదు. సింధూలోయ, హరప్పా, మొహంజోదారోలలో బయల్పడిన విశేష వస్తుసామాగ్రి వేదాలకు పూర్వముండిన భారతీయ ఆలోచనా సంప్రదాయాలకు ప్రాప్తి స్థానమనవచ్చు. అంతేగాక సంగం వాఙ్మయమంతా

వేదకాలానికి పూర్వముండిన భారతీయ ఆలోచనా సంప్రదాయమేగదా. ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని ప్రస్తావించడం అవసరం. భారతీయ తత్త్వశాస్త్రమనేది భారతదేశంలోని అన్ని వర్గాలనుండి జనించలేదు. అవాడు ఆధిపత్యంలోను, అధికారంలోను, అంతస్థులోనువున్న ఒక ప్రత్యేకమైన వర్గం మాత్రమే దానిని రూపొందించింది. ఆ ఆలోచన ఆ వర్గం ఆధిక్యతకు తోడ్పడేదిగా మాత్రమే రూపొందించారు. దీనినే సాంఘిక శాస్త్రంలో ఉన్నత వర్గాల (elitism) ఆలోచన అంటారు. భారతీయ ఆలోచనగా చెలామణి అవుతున్న బ్రాహ్మణ తత్త్వశాస్త్రంలో సంప్రదాయకంగా శూద్రులు పంచములనే వారికి ప్రాధాన్యత దొరకలేదు. అక్కడక్కడ మినహాయింపులున్నావన్నా సంగతి మనం కాదనలేం.

ఈనాటి గిరిజనులు, నిమ్నజాతులు పంచములనబడేవారి ఆలోచనకు, అవగాహనకు ఈ భారతీయ ఆలోచనలో స్థానంలేదు. అనగా, అధికసంఖ్యాకులైన భారతీయుల ఆలోచనకు, భారతీయ తత్త్వశాస్త్రంలో స్థానంలేదు. ఒకవిధంగా భారతీయ తత్త్వశాస్త్రాన్ని ఆర్యుల తత్త్వశాస్త్రమనడం ఉచితం, ధర్మంగూడాను. అందువలననేనేమో, ఒకానొకప్పుడు భారతీయ ఆలోచనను ఆర్య ధర్మమన్నారు. మొత్తానికి ఈ ఆలోచనవలన మన సమాజంలోని మానవ సంబంధాలు మానవ విహీనస్థాయికి దించివేయబడినై. హెచ్చుతగ్గులతో, విభిన్న విలువలతో, వృత్తులతో మన సమాజం చీల్చబడడానికి ఈ ఆర్యుల తత్త్వశాస్త్రం మూలమనవచ్చు

ఇప్పుడు మన సమాజం ఈ అవలక్షణాలనుండి విమోచించబడి అసలు శినలైన భారతీయ సమాజంగా రూపొందాలంటే, అధికసంఖ్యాకులైన ఆర్యేతర, నిమ్నజాతుల ఆలోచనలోని మానవతాధోరణులను, బ్రాహ్మణ తత్త్వశాస్త్రంలోని మానవతా ధోరణులను మేళవించి, ఒక సమగ్ర, సామస్త్య భారతీయ తత్త్వశాస్త్రాన్ని రూపొందించడం అత్యావసరం. అనగా, వాస్తవం, (reality) మానవుడు, ప్రకృతి, సమాజం, అనేవాటిపట్ల అధికసంఖ్యాకులైన నిమ్నజాతులు, అడవిజాతులవారి ఆలోచనను, పురావస్తు పరిశోధనలద్వారా,

జానపద కథలు, కీర్తనలు, సంప్రదాయాలద్వారా, వారి ఆలోచనకు సంబంధించి మనకు లభ్యమయ్యే వాఙ్మయంద్వారా ఒక దర్శనరూపంలో నిర్మించవలసిన సమయం వచ్చింది. అప్పుడే భారతీయులందరు గర్వించగల అసలు శిసలైన, సమగ్ర, భారతీయ తత్త్వశాస్త్రం రూపొందుతుంది. దానికే పిలుపునిస్తుంది ఆధునిక భారతీయ సమాజం.

## 3 మార్పుకు చోటునిచ్చే తత్త్వశాస్త్రం

ప్రకృతికి మనిషికి మధ్యనుండే సంబంధాలలో మార్పులు జరిగే కొలది, మానవ సంబంధాలలోను, విలువలను గురించిన మానవుల భావాల లోను మార్పులు జరుగుతూవుంటాయి. ఐతే ఈ మార్పులకు పునాదులువేసేది చాల వరకు తత్త్వశాస్త్రజ్ఞులే అనవచ్చు. పరిస్థితుల కనుగుణ్యమైన మార్పులను వ్యతిరేకించే ఏ తత్త్వశాస్త్రజ్ఞుడైనా, తత్త్వశాస్త్ర ఉపాధ్యాయుడైనా తాత్త్విక పండితుడైనా, తత్త్వశాస్త్రి అనబడే యోగ్యతను కోల్పోతాడు. అలాంటి వారిని తత్త్వశాస్త్రజ్ఞుల జాబితాలో చేర్చడం చాల పొరబాటు. అలాంటి వారిలో, తాత్త్విక జిజ్ఞాసకు, మానవ కళ్యాణానికి వేరుగా తమ స్వార్థ అభిరుచులున్నవని బాహాటముగా తెలుస్తుంది ఈ స్వార్థ అభిరుచులను నెరవేర్చుకోడానికి తత్త్వశాస్త్రి అనే ముసుగు వేసికొంటారు. నిరూపించలేక పోయినా తమ స్వార్థానికి పనికివచ్చే మత భావాలకు తాత్త్విక రంగుపూసి సమాజాన్ని విభజించి పాలించే అవకాశం ఇక్కడ ఎంతైనావుంది. సమాజంలో పెద్ద మనుషులుగా, జ్ఞానులుగా, ఆదర్శపురుషులుగా చెలామణి అవడానికి ఈ మత పరదా చాల సరదాగా పనిచేస్తుంది. సమాజాన్ని వెనక్కు వయనింపజేసే నానారకాల ఆలోచనా ధోరణులను ఈ ముసుగులో నుండి ఉత్పత్తి చేస్తుంటారు.

ప్రజలు. ఈలాంటి నకిలీ తత్త్వశాస్త్రజ్ఞులను పసిగట్టలేక వారుచెప్పే మానవ వ్యతిరేక, వర్గాభిమాన, కుల దురహంకార, ప్రాంతీయ దురభిమాన, జాత్యంహంకార భావాలను అమల్లోపెట్ట ప్రయత్నిస్తారు. తుదకు ఈ

దోరణులు సమాజంలో విచ్ఛిన్నకర కార్యాలకు, విభజనలకు, మారణకాండకు దారితీస్తాయి. ఐతే, సామాన్య మానవునికి ఈ నాటకాలకు వెనక నున్న సూత్రధారులెవరో తెలియకపోయినా అందులో పాత్రధారుడుగా మాత్రం మహా ఉద్వేగంతో బలియైపోతుంటాడు. అందువలన తత్త్వశాస్త్రాన్ని చదివే వారుగాని, వినేవారుగాని. ఎవరు యదార్థమైన(authentic)తత్త్వశాస్త్రజ్ఞులో ఎవరు నకిలీ (counterfeit) తత్త్వశాస్త్రజ్ఞులోననే విషయాన్ని కొంత పరిశీలన చేయడం ఎంతో ఆవసరం.

సమకాలీన భారతదేశ సమస్యలు, పరిణామాలు, ఆశలు, అతి ప్రగాఢమైన వాంఛలు. శక్తిసామర్థ్యాల దృష్ట్యా, దేశంలోని ప్రజలందరి ప్రగతికొరకు తోడ్పడే తత్త్వశాస్త్రాలను రాయాలని, దేశం ఎదురుచూస్తుంది. సుసంగతమైన విలువలకు, మానవత్వాన్ని అణచివేయని సంస్కృతికి, స్వార్థంకొరకు దేశాన్ని ముక్కలు చెక్కలు చేయని జాతీయతకు, దేశ ప్రజలందరికి గర్వకారణం కాదగిన భవిష్యత్తుకు పునాదులు వేయగల తత్త్వశాస్త్రాలను వాడుక భాషలో రూపొందించమని నేటి భారతీయ పరిస్థితులు భారతీయ తత్త్వశాస్త్రజ్ఞులను సవాలు చేస్తున్నయ్.